# తల్లి అయ్యే అవకాశాన్ని... చేతులారా దూరం చేసుకోవద్దు



**తెలుగు రాష్ట్రాల్లో ప్రఖ్యాతి గాంచిన సంతాన వైద్యనిపుణురాలు డాక్టర్ పద్మలత యారాశి**

**సంతానరాహిత్యంతో అలమటిస్తున్న వేలాది కుటుంబాల్లో పసిపిల్లల చిరునవ్వులు చిందించిన సక్సెస్‌ఫుల్ డాక్టర్**

ప్రశ్న: మేడమ్ గారికి నమస్కారం, నా వయస్సు 22 సంవత్సరాలు, మా ఆయనకు 26 సంవత్సరాలు, పెళ్లయి మూడేళ్లవుతోంది. పెళ్లయిన తరువాత రెండేళ్ల వరకు పిల్లలు వద్దని, పిల్లలు పుడితే సుఖంగా... సంతోషంగా గడలేమని, వాళ్ళ పెంపకంలో, ఆలనా పాలనా చూసుకోవడంలో సంసార సుఖాన్ని మిస్ అవుతామని... దాంతో కాపురంలో అనేక సమస్యలు, చికాకులు వస్తాయని మా వారు నాకు నచ్చచెప్పి మొదటి సంవత్సరం కండోమ్ ద్వారా, రెండో సంవత్సరం నోటి మాత్రల ద్వారా దాదాపు రెండు సంవత్సరాలు గర్భం రాకుండా జాగ్రత్త పడ్డాం. మూడో సంవత్సరం పిల్లలు కావాలనుకున్నాం. ఎలాంటి గర్భ నిరోధక ప్రయత్నాలు చేయకుండా కలుసుకున్నాం, ఇప్పుడు సంవత్సరం దాటుతున్నా మాకు పిల్లలు కలగలేదు. నా తరపువాళ్లు మా ఆయన తరపు వాళ్లు మేము మొదట్లో ఏవేవో మందులు వాడడం వల్లే ఇప్పుడు పిల్లలు కలగడం లేదని... ఇక శాశ్వతంగా మాకు పిల్లలు పుట్టరని తిడుతున్నారు, మాకు చాలా టెన్షన్‌గా ఉంది. దయచేసి మా సమస్యకు పరిష్కారం చూపించగలరు?

(నీలిమ, విజయవాడ)

జవాబు:"తానొకటి కలిస్తే, దైవమొకటి తలిచిందని..." కొంతకాలం మీకు మీరుగా పిల్లలు వద్దను కున్నారు. ఇప్పుడు పిల్లలు కావాలను కుంటున్నారు. కానీ పుట్టట్లేదు. అప్పుడు పిల్లలు పుడితే సమస్యలు వస్తాయనుకున్నారు. ఇప్పుడు పిల్లలు పుట్టక పోవటమే పెద్ద సమస్య అయి కూర్చుంది.

ఈ మధ్య కాలంలో చాలా మంది ఇలాంటి సమస్యతోనే బాధపడుతున్నారు. పిల్లలు పుడితే సుఖంగా సంతోషంగా గడపలేమనుకోవడం గర్భం రాకుండా ఏవేవో జాగ్రత్తలు తీసుకోవడం చాల తప్పు. తప్పనిసరి పరిస్థితులైతే తప్ప పిల్లల్ని కనటం వాయిదా వేయవద్దు. పిల్లల పెంపకం, వారి ఆలనా పాలనా చూసుకోవడం ఒక వారసత్వ ఆత్మీయత ఒక బాధ్యత. మీరు మన పూర్వీకుల్ని గమనించండి. పెళ్లయిన సంవత్సరంలోపే గర్భం దాల్చేవారు. రెండు సంవత్సరాల్లో రెండు కాన్పులు జరిగేవి. తల్లిదండ్రులు మధ్య వయస్సుకు వచ్చేసరికి పిల్లలు యుక్తవయస్సుకు వచ్చేవారు చేతికి అందివచ్చేవారు ఎందుకో తెలుసా?

సాధారణంగా యుక్తవయస్సులో స్త్రీలలో అండాలు లక్షల సంఖ్యలో విడుదలవుతూ ఉంటాయి. వయస్సు పెరిగే కొద్ది అది క్రమక్రమంగా తగ్గుతూ వేల, వందల సంఖ్యల్లోకి వస్తాయి. దాంతో గర్భం వచ్చే అవకాశాలు అలాగే తగ్గిపోతాయి. ఇది కేవలం స్త్రీల సమస్యే కాదు పురుషులది కూడా. వయసులో ఉన్న పురుషుల్లో శుక్రకణాల ఉత్పత్తి కోట్లలో ఉంటుంది. కణాల కదలికలు, చురుకుదనం కూడా ఎక్కువగా ఉంటుంది. అంతేకాదు వాటి ఆకృతి, ప్రకృతి కూడా సహజ సిద్ధంగా ఉంటుంది. అందుకే అంటారు ఏ వయస్సులో జరిగే ముచ్చట ఆ వయసులో జరగాలని, ఇక మీ విషయానికి వస్తే... మీరు మొదటి రెండు సంవత్సరాలు గర్భం రాకుండా ఎలాంటి పద్ధతులు పాటించారు? ఏయే మందులు వాడారు? తెలిస్తే... ఒక డాక్టర్‌గా నేను ఆయా మందుల్ని, పద్ధతుల్ని పరిశీలించి సరైన సలహా ఇవ్వగలను. రెండోది, మీకు, మీ వారికి కొన్ని పరీక్షలు చేసి లోపం ఎవరిలో ఉందో తెలుసుకోవడం ముఖ్యమైనది. లోపం ఎవరిదో తెలిసాక దానికి తగిన వైద్యం చేస్తే మీకు పండంటి పాపో? బాబో? పుట్టడం ఖాయం.

మీరు మనసులో ఎలాంటి భయాలు, ఆందోళనలు పెట్టుకోకుండా ఒకసారి ఏదైనా ఫెర్టిలిటి సెంటర్‌కు వెళ్ళి మీ సమస్యను పరిష్కరించుకోగలరు.

ఒక ప్రాణిగా పుట్టి
మరో ప్రాణికి జన్మనిచ్చేది అమ్మ
అమ్మ లేకపోతే
ఈ సృష్టి ఎప్పుడో అంతం అయ్యేది
సృష్టికి ప్రతి సృష్టి చేసే మాతృత్వం
అమ్మ... కళ్లముందు కన్పించే దైవత్వం
మాతృత్వానికి–దైవత్వానికి
మధ్య "మాతృత్వ" సేవ ఒక మానవత్వం
అది మా పుర్వజన్మ సుకృతం.

ADVT



## మాతృత్వ టెస్ట్‌ట్యూబ్ బేబి సెంటర్

### హైదరాబాదు
ఫ్లాట్ నెం: 29, రోడ్ నెం- 01, జూబ్లిహిల్స్, ఫిల్మ్‌నగర్, హైదరాబాదు. ఫోన్ : 9100222604

### తిరుపతి
మాతృత్వ టెస్ట్‌ట్యూబ్ బేబి సెంటర్
మా భూమి టవర్స్, డోర్ నెం: 18-1-302ఎ/ఎ1
భవాని నగర్, కెటి రోడ్, తిరుపతి ఫోన్ : 8099922897

### కోరమంగళ
మాతృత్వ టెస్ట్‌ట్యూబ్ బేబి సెంటర్
సైట్-2, బి బ్లాక్, 100 ఫీట్‌రోడ్, కోరమంగళ ఎక్స్‌టెన్షన్, బెంగుళూరు. ఫోన్: 09108446553

### బెంగుళూరు
మాతృత్వ టెస్ట్‌ట్యూబ్ బేబి సెంటర్
57/1, ఈస్ట్‌పార్క్‌రోడ్, మల్లేశ్వరం, బెంగుళూరు. ఫోన్: 09108446553

### హొసూరు
విజయ్ సృష్టి ఫెర్టిలిటి సెంటర్,
నెం: 76, ఓల్డ్ బెంగుళూరు రోడ్, హొసూరు
ఫోన్: 09944827846

### కర్నూలు
మాతృత్వ టెస్ట్‌ట్యూబ్ బేబి సెంటర్
డోర్‌నెం. 50-760, ఫస్ట్ ఫ్లోర్, విశ్వభారతి హాస్పిటల్ లేన్, గాయత్రి ఎస్టేట్స్, కర్నూలు. ఫోన్: 7331164105



### ప్రొద్దుటూరు
**పద్మ టెస్ట్‌ట్యూబ్ బేబి సెంటర్**
ప్రొద్దుటూరు, కడప జిల్లా.
ఫోన్ : 9100775988, 9704555302

● టాప్ స్టోరీస్



● జాతీయాలు



## కొంగునున్న చిచ్చు!

ప్రమాదాలు రకరకాలుగా ఉంటాయి.

ఊహించని ప్రమాదాలు.

ఊహకు అందే ప్రమాదాలు... ఇవి కాకుండా 'కొంగు చిచ్చు'లాంటి ప్రమాదాలు.

ఒక ప్రమాదం మనతో పాటే ఉండి దాని గురించి మనకు తెలియని సందర్భంలో ఉపయోగించే జాతీయం ఇది.

ప్రమాదకరమైన వ్యక్తులతో స్నేహం చేయడం,

ఏదైనా ఒక ప్రమాదం అతి సమీపంగా రావడం,

ప్రమాదకరమైన పరిస్థితుల్లో ప్రయాణం చేస్తూ.... ఆ ప్రమాదం గురించి 'స్పృహ' లేకపోవడం... వంటి సందర్భాల్లో ఈ జాతీయాన్ని ఉపయోగిస్తుంటారు.

ఉదా:

'తన కొంగునున్న చిచ్చు గురించి తెలియదుగానీ... అందరి యోగక్షేమాలు ఆరాతీస్తున్నాడు'

## దుష్టచతుష్టయం

ఎవరైనా నలుగురు చెడ్డవాళ్లు ఒక్క దగ్గర చేరితే ఉపయోగించే మాట ఇది.

మహాభారత కథలో... దుర్యోధనుడు, దుశ్శాసనుడు, కర్ణుడు, శకుని ఈ నలుగురిని 'దుష్టచతుష్టయం' పేరుతో వ్యవహరిస్తారు. ఈ నలుగురు ఒక దగ్గర చేరితే... చెడ్డ పనికి శ్రీకారం చుట్టుకున్నట్లే! అరణ్యవాస సమయంలో పాండవులను సంహరించాలనుకోవడం, లాక్షాగృహదహనంతో పాండవులను అంతమొందించాలనుకోవడం... ఒకటా రెండా... పాండవులకు అడుగడుగునా ప్రమాదాలకు గురిచేస్తూ ఇబ్బందులు పెడుతుంది ఈ దుష్టచతుష్టయం.



**ఉదా:** 'ఆ నలుగురు అమాయకులేం కాదు... వారు దుష్టచతుష్టయం'

## దుడ్డు కర్ర మాట!

'దుడ్డు కర్రా... దుడ్డు కర్రా ఎవరి మాట వింటావు?' అని అడిగితే–

'ఎవరి చేతిలో ఉంటే వారి మాట వింటాను' అన్నదట.

దుడ్డుకర్ర చెడ్డవాడి చేతిలో ఉండొచ్చు.

అంతమాత్రానా...

'అయ్యో! నేను చెడ్డ వాడి చేతిలో ఉన్నానే' అని బాధ పడదు.

దుడ్డుకర్ర మంచి వాడి చేతిలో ఉండొచ్చు. అప్పుడు...

'నేను ఒక మంచి మనిషికి రక్షణగా ఉన్నాను' అనుకోదు.

ఎవరి చేతిలో ఉంటే వారి మాట వింటుంది.

ఇక్కడ 'దుడ్డు కర్ర' అనేది 'అధికారం' కావచ్చు. లేదా 'మంచి చెడు విచక్షణ తెలియక పోవడం' కావచ్చు.

సందర్భాన్ని బట్టి 'దుడ్డు కర్ర' మాటను ఉపయోగిస్తుంటారు.





## గుడ్డులోపలి కూన

ప్రపంచ పోకడలు, మంచి చెడ్డలు, వింతలు, విడ్డూరాలు గుడ్డు లోపలి కూనకు తెలుస్తాయా? గుడ్డు పగిలి, బయటి కొచ్చి, పెరుగుతున్న క్రమంలోనే కదా... ఒక్కొక్క విషయం గురించి తెలిసిపోతుంది.

స్థూలంగా చెప్పాలంటే... కూన గుడ్డులో ఉన్న దశ ఏమీ తెలియని దశ.

అజ్ఞానం వల్లో, అనుభవ లేమీ వల్లో, వయసు చాలకో... చాలా మందికి చాలా విషయాలు తెలియకపోవచ్చు. ఇలాంటి సందర్భాల్లో 'గుడ్డులోపలి కూన' జాతీయాన్ని ఉపయోగిస్తుంటారు.

ఉదా:

'అనుభవంతో తలపండిన నేను నీలాంటి గుడ్డు లోపలి కూన మాట వినాల్సిన అవసరం లేదు'

ఫన్‌డే మీద మీ అభిప్రాయాలను, సూచనలను మాకు తెలియజేయండి. ప్రియదర్శిని రామ్, ఎడిటర్, ఫన్‌డే, సాక్షి దినపత్రిక, 6-3-249/1, రోడ్ నం.1, బంజారాహిల్స్, హైదరాబాద్ – 34. funday.sakshi@gmail.com

బుక్ డిజైనింగ్: కుసుమ

• ఆదర్శం

# గ్రీన్ అంబులెన్స్... చెట్టంత అండ...

మొక్కలు నాటడం ఒక్క ఎత్తయితే... వాటిని పరిరక్షించుకోవడం మరో ఎత్తు. చాలామందికి మొక్కలను నాటడం మాత్రమే తెలుసు. ఆ తరువాత ఆ విషయాన్ని మరిచిపోతారు. మనిషిలాగే చెట్లు కూడా ప్రమాదకర పరిస్థితులను ఎదుర్కొంటాయి. మనిషి ప్రమాదకరమైన పరిస్థితిలో ఉన్నప్పుడు అంబులెన్స్‌లు ఆఘమేఘాల మీద సంబంధిత ప్రదేశానికి చేరుకుంటాయి. చెట్లకు మాత్రం ఈ సౌకర్యం ఎందుకు ఉండకూడదనే ఉద్దేశంతో వడోదర(గుజరాత్)లోని స్వచ్ఛందసంస్థ 'పగ్‌డాండ్' వడోదర మున్సిపల్ కార్పోరేషన్ (వియంసీ) సహకారంతో 'గ్రీన్ అంబులెన్స్' సదుపాయాన్ని ప్రారంభించింది.

నగరంలో ఒకప్పుడు వేలాది మొక్కలు నాటిన ఈ సంస్థ... ఆ మొక్కలు ఆరోగ్యంగా పెరగడానికి, వాటిని ప్రమాదకర పరిస్థితుల నుంచి తప్పించడానికి మూడు చక్రాల గ్రీన్ అంబులెన్స్‌లను ఉపయోగిస్తుంది.

'ఫలానా చోట మొక్కల ఆలనా పాలనా ఎవరూ పట్టించుకోవడం లేదు'

'ఫలానా చోట మొక్కలను పశువులు తింటున్నాయి'

'నీళ్ల లేక మొక్కలు ఎండిపోతున్నాయి'... ఇలాంటి ఫోన్ కాల్స్ ఆ స్వచ్ఛంద సంస్థ హెల్ప్ లైన్‌కు రాగానే... వెంటనే 'గ్రీన్ అంబులెన్స్' రంగంలోకి దిగుతుంది. నీళ్లు, ఎరువులు... ఇలా చెట్ల సంరక్షణకు అవసరమైన అన్ని రకాల వస్తువులు, ఏర్పాట్లు ఇందులో ఉంటాయి.

నగరంలో నాటిన మొక్కల్లో 13 శాతం మాత్రమే బతుకుతున్నాయి. ఈ పరిస్థితిలో మార్పు తీసుకురావడానికి 'గ్రీన్ అంబులెన్స్'లతో రంగంలోకి దిగింది 'పగ్‌డాండ్'

మొక్కల విలువ గురించి విస్తృత అవగాహన కలిగించడం, మొక్కల్ని నాటడం, ఇతరుల చేత నాటించడం, వాటి సంరక్షణకు పాటు పడడం... తన కార్యరంగాలుగా ఎంచుకుంది 'పగ్‌డాండ్'

పర్యావరణ సంరక్షణలో స్థానిక ప్రభుత్వ శాఖలను క్రియాశీలంగా భాగస్వాములను చేయడం, బడులలో ఎకో క్లబ్‌లను స్థాపించడంలాంటి పనులు చేస్తుంది 'పగ్‌డాండ్'.

''గ్రీన్ అంబులెన్స్‌ల గురించి చాలామంది ఆసక్తిగా అడుగుతుంటారు. వినూత్నమైన ఆలోచన అని ప్రశంసిస్తుంటారు. నగరంలో గ్రీన్ అంబులెన్స్‌ల ప్రవేశం తరువాత మొక్కల సర్వైవల్ రేట్ పెరిగింది'' అంటున్నారు 'పగ్‌డాండ్' ఫౌండర్ ట్రస్టీ నిషిత్ దాండ్.

కొన్ని సందేశాలకు వేదికలు, ఉపన్యాసాలు అక్కర లేదని ఈ గ్రీన్ అంబులెన్స్‌లు నిరూపిస్తున్నాయి. రోడ్డు మీద వెళుతున్న ఈ గ్రీన్ అంబులెన్సులు చెట్ల విలువ, పరిరక్షణ గురించి మౌనసందేశాన్ని మోసుకెళుతున్నట్లుగా ఉంటాయి. ఒకరి నుంచి ఒకరికి గ్రీన్ అంబులెన్స్‌ల గురించి మాత్రమే కాదు... పర్యావరణ పరిరక్షణ గురించి తెలుసుకునే అవకాశం ఏర్పడుతుంది. వడోదర 'గ్రీన్ అంబులెన్స్'ల స్ఫూర్తి దేశంలోని మిగిలిన ప్రాంతాలకు కూడా విస్తరిస్తే... నాటిన ప్రతి చెట్టు క్షేమంగా ఉంటుంది. మనల్ని క్షేమంగా చూస్తుంది.

### ఫీజు అక్కర్లేదు మొక్క నాటితే చాలు!

ఛత్తీస్‌గఢ్, అంబికాపూర్‌లోని 'శిక్షా కుటీర్' అనే స్కూల్ చెట్ల సంరక్షణకు వినూత్నంగా ప్రయత్నిస్తుంది. పిల్లలను స్కూల్లో చేర్పించే సమయంలో పేరెంట్స్ కొన్ని మొక్కలను తప్పనిసరిగా నాటాల్సి ఉంటుంది. తాము నాటిన మొక్క ఒకవేళ చనిపోతే దాని స్థానంలో వేరొక మొక్క నాటాల్సి ఉంటుంది. పేరెంట్స్ ఫీజులు కట్టలేని స్థితిలో ఉంటే కొన్ని మొక్కలు నాటితే చాలు!

### ట్రీ హెల్ప్‌లైన్

ఢిల్లీ ప్రభుత్వం చెట్ల సంరక్షణకు చాలా కాలం క్రితమే 'ట్రీ హెల్ప్ లైన్'ను ప్రారంభించింది. చెట్లకు ఎవరైనా హాని కలిగిస్తున్నా, ఎక్కడైనా చెట్లు ప్రమాదకరమైన స్థితిలో ఉన్నా ఈ హెల్ప్‌లైన్‌కు ఫోన్ చేయవచ్చు. 'ఫలానా చోట ఉన్న చెట్టుకు ఇలాంటి ఏర్పాటు చేస్తే బాగుంటుంది'లాంటి సలహాలు కూడా ఇవ్వవచ్చు. ఢిల్లీ ప్రభుత్వ పర్యావరణ శాఖ ప్రవేశపెట్టిన ఈ టోల్-ఫ్రీ నంబర్ ట్రీ హెల్ప్ లైన్ మంచి ఫలితాన్ని ఇచ్చింది.

### • కిసుక్కు



రామయ్య: నా దగ్గర తీసుకున్న డబ్బులు తిరిగి ఇవ్వడం లేదు ఎందుకు?
సోమయ్య: నీ డబ్బులు పువ్వుల్లో పెట్టి ఇస్తానన్నాను కదా... పువ్వులు దొరకడం లేదు.

– జి.మురారి, నెల్లూరు

### • మీకు తెలుసా





జర్మనీలోని బవరియన్ నేషనల్ పార్క్‌లో ప్రపంచంలోనే అతి పొడవైన 'ట్రీ ట్రాక్' ఉంది. 1300 మీటర్ల పొడవైన ఈ వంతెనను పూర్తిగా కలపతో నిర్మించారు.

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో 'స్పాండిలోసిస్'కు సమర్థవంతమైన పరిష్కారం



డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్

ప్రస్తుత మానవుని జీవన విధానంలో ఎన్నో మార్పులు రావడం వలన ఎక్కువ సమయం కంప్యూటర్ల ముందు కూర్చొని పని చేయడం, ఎక్కువ దూరం వాహనాలపై ప్రయాణించడం వంటి ఎన్నో అంశాల కారణంగా వెన్నెముకపై ఒత్తిడి పెరగటం వలన చాలా రకాల వెన్నెముక సమస్యలు తలెత్తడం జరుగుతుంది. వాటిలో స్పాండిలోసిస్ సమస్యను మనం ఎక్కువ మందిలో గమనించవచ్చు. మానవ శరీరంలో 'వెన్నెముక'ది అత్యంత కీలకమైన పాత్ర. దీని నిర్మాణం ఎంతో సంక్లిష్టమైనది. మెదడు నుండి వచ్చే వెన్నుపాము **(Spinal Cord)** ను కాపాడుతూ, శరీరంలోని అన్ని కదలికలకూ సహకరిస్తూ, శరీరానికి ఇది మూలస్థంభంగా నిలుస్తుంది.

**స్పాండిలోసిస్ అనగా:** వెన్నెముకలోని డిస్కులు మరియు ఫేసెట్ జాయింట్లలోని మృదులాస్థి క్షీణతకు గురి కావడాన్ని వైద్యపరిభాషలో స్పాండిలోసిస్ అని అంటారు. దీనినే స్పైనల్ ఆర్థరైటిస్ అని కూడా అంటారు. 40 ఏళ్ళు పైబడిన వారిలో ఈ సమస్య ఎక్కువగా కనిపిస్తుంది. కానీ ప్రస్తుత జీవనశైలిలో అనేక మార్పులు చోటు చేసుకోవడం, వాటి ప్రభావం వెన్నెముకపై ఎక్కువగా ఉండటం కారణంగా ఈ సమస్య చిన్న వయస్సు వారిలో కూడా ఎక్కువగా కనిపిస్తోంది.

సాధారణంగా వెన్నెముకలోని రెండు పూసల మధ్య డిస్కులు ఉంటాయి, మరియు వాటి వెనుక భాగంలో ఫేసెట్ అనే జాయింట్లు ఉంటాయి. వీటిలోని మృదులాస్థి, వెన్నెముకకు సంబంధించిన అన్ని కదలికలకు సహకరిస్తూ, ఇవి ఒత్తిడిని తట్టుకునే షాక్ అబ్‌సార్బర్‌లుగా పని చేస్తాయి. వీటి చుట్టూ ఉండే కండరాలు, లిగమెంట్లు మరియు టెండాన్లు జాయింట్లను దృఢంగా ఉంచుతాయి. వెన్నుపూసలలోని నాళాన్ని స్పైనల్ కెనాల్ అంటారు. దీని నుండి వెన్నుపాము ప్రయాణిస్తూ నిర్దిష్ట ప్రాంతాలకు నరాలను పంపుతుంది.



ఏ కారణం చేతనైనా ఈ డిస్కులు లేదా ఫేసెట్ జాయింట్లు క్షీణతకు గురి అయితే వెన్నెముకలో అనేక మార్పులు ఏర్పడటంతో, నొప్పి మరియు కదలికలు కష్టతరంగా మారడం వంటి సమస్యలు తలెత్తుతాయి. వాటి ప్రభావం వలన అక్కడ నుండి వెలువడే నరాలపై ఒత్తిడి పడితే ఆయా అవయవాల పనితీరు దెబ్బతిని తీవ్రమైన నొప్పి సంభవిస్తుంది. సాధారణంగా వెన్నెముకలోని మెడ భాగాన్ని - సర్వైకల్ స్పైన్, వీపు భాగాన్ని - థొరాసిక్ స్పైన్, నడుము భాగాన్ని - లుంబార్ స్పైన్ మరియు క్రింది భాగాలను - సాక్రం, కాకిక్స్ అని అంటారు. క్షీణతకు గురి అయిన ప్రాంతాన్ని బట్టి ఈ సమస్యను సర్వైకల్ స్పాండిలోసిస్, థొరాసిక్ స్పాండిలోసిస్, లుంబార్, సాక్రల్ స్పాండిలోసిస్ అని పిలవటం జరుగుతుంది. వీటిలో సర్వైకల్ స్పాండిలోసిస్ మరియు లుంబార్ స్పాండిలోసిస్ సమస్యలను మనం ఎక్కువగా గమనించవచ్చు.

**కారణాలు:** వయస్సు పైబడటం • వెన్నెముకకు దెబ్బ తగలటం • ఎక్కువగా బరువులు మోయడం • ఒకే పొజిషన్‌లో ఎక్కువ సమయం కూర్చోవడం • ద్విచక్ర వాహనాలపై ఎక్కువగా ప్రయాణించడం • కంప్యూటర్ల పైన రోజంతా పనిచేయడం • ఎత్తయిన దిండ్లు వాడటం మరియు ఫోన్‌లో మాట్లాడేటప్పుడు మెడను సాగదీసి ఒక ప్రక్కకు వంచడం వలన మెడనొప్పి కలుగుతుంది.

**లక్షణాలు:** 'స్పాండిలోసిస్' సంబంధిత లక్షణాలు, శరీరంలో అది ప్రభావితం చేసిన భాగాన్ని బట్టి కనిపిస్తాయి.

### సర్వైకల్ స్పాండిలోసిస్:

- మెడనొప్పి సాధారణం నుండి తీవ్రస్థాయికి చేరటం.
- నొప్పి - భుజాలతో పాటు చేతులకు మరియు వేళ్ళ వరకు కూడా వ్యాపించడం.
- మెడ బిగుసుకుపోవడం లేదా కదలికలు తగ్గిపోవడం.
- మెడ నరాలపై ఒత్తిడి పడటం వలన చేతులు బలహీనపడటం, పట్టు కోల్పోవడం, తిమ్మిర్లు, మొద్దుబారటం వంటి లక్షణాలను గమనించవచ్చు.
- కొన్ని సార్లు తలనొప్పి, కళ్ళు తిరగడం, వికారం, వాంతులు కావడం వంటి లక్షణాలు గమనించవచ్చు.

### లుంబార్ స్పాండిలోసిస్:

- నడుము నొప్పి, ఉదయాన్నే నడుము బిగుసుకుపోవడం.
- నొప్పి నడుము నుండి పిరుదులకు మరియు కాళ్ళ వరకు వ్యాపించడం.
- నడుము భాగంలోని నరాలపై ఒత్తిడి పడటం వలన కాళ్ళలో తిమ్మిర్లు, మొద్దుబారటం, నడకలో బ్యాలెన్స్ తప్పడం, మలమూత్రాల విసర్జనపై నియంత్రణ కోల్పోవడం.
- సయాటికా వంటి లక్షణాలను కూడా గమనించవచ్చు.
- వెన్నెముకలోని ఏ భాగంలోనైనా దీర్ఘకాలిక నొప్పి కారణంగా జ్వరం, ఆకలి మందగించడం, బరువు తగ్గడం వంటి లక్షణాలు కనిపిస్తే నిర్లక్ష్యం చేయకూడదు. అవి క్యాన్సర్ లేదా క్షయ లక్షణాలు కావచ్చు.

**వ్యాధి నిర్ధారణ పరీక్షలు:** సి.బి.పి., ఎక్స్‌రే, సి.టి. స్కాన్, ఎమ్.ఆర్.ఐ. స్కాన్, హెచ్.ఎల్.ఏ.బి.27 • చేతులు, కాళ్ళ కదలికలను మరియు రిఫ్లెక్సస్‌ను పరీక్షించడం వంటి పరీక్షలు చేయడం ద్వారా వ్యాధిని నిర్ధారించవచ్చు.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ చికిత్స:** హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో అందించబడే అధునాతనమైన జెనెటిక్ కాన్‌స్టిట్యూషనల్ చికిత్సా విధానం ద్వారా రోగి మానసిక మరియు శారీరక లక్షణాలను పరిగణనలోకి తీసుకొని చికిత్స అందించడం ద్వారా వెన్నెముకను దృఢంగా చేసి, తద్వారా స్పాండిలోసిస్ సమస్య తిరగబెట్టకుండా వ్యాధిని సంపూర్ణంగా నయం చేసే అవకాశం ఉంటుంది.

## నిద్రలేమితో ఆస్తమా తీవ్రం!

నిద్రలేమి (ఇన్‌సామ్నియా) సమస్యతో బాధపడేవారిలో ఆ పరిణామం ఆస్తమాకు దారితీస్తుందని పేర్కొంటున్నారు నిపుణులు. ఇటీవల నార్వేజియన్ యూనివర్సిటీ ఆఫ్ సైన్స్ అండ్ టెక్నాలజీ ఆధ్వర్యంలో నిర్వహించిన అధ్యయనాలు ఈ విషయాన్ని తేటతెల్లం చేస్తున్నాయి. ఉబ్బస వ్యాధితో బాధపడే రోగులలో ఆస్తమా అటాక్ వస్తే రాత్రివేళ నిద్రలేకపోవడం, నిద్రలో నాణ్యత లోపించడం వంటి కారణాలతో బాధపడటం మామూలే. అయితే రాత్రివేళ సరిగా నిద్ర పట్టకపోవడం కూడా ఆస్తమాకు దారి తీస్తుందన్న విషయం తెలిసిందని ఈ అధ్యయనంలో పాల్గొన్న శాస్త్రవేత్త లిన్ బీటె స్ట్రాండ్ పేర్కొన్నారు. నిద్రలేమితో బాధపడుతున్న 20 నుంచి 65 ఏళ్ల వయసున్న దాదాపు 18,000 మందిపై నిర్వహించిన అధ్యయనంలో చాలామందికి ఆస్తమా ముప్పు వాటిల్లినట్లు తెలిపారు స్ట్రాండ్. ముఖ్యంగా దీర్ఘకాలిక ఇన్‌సామ్నియాతో బాధపడ్డవారిలో ఈ ముప్పు ఎక్కువని తేలింది.



## భవిష్యత్తులో గుండె జబ్బులే ఉండవా?!



యాంటీ క్యాన్సర్ మందుల కోసం జరుగుతున్న పరిశోధనల్లో శాస్త్రవేత్తలకు అకస్మాత్తుగా ఒక కొత్త విషయం తెలిసింది. అదే... యాంటీ క్యాన్సర్ మందు ఒకటి కంజెస్టివ్ హార్ట్ ఫెయిల్యూర్‌లనూ నివారిస్తుందని తెలిసింది. సాధారణంగా మన దేహంలోని చాలా కణాలు... అంటే ఉదాహరణకు కడుపులో లోపలి వైపున లైనింగ్ వంటి చోట్ల ఉన్న కణాల్లో ఎప్పటికప్పుడు కొత్తవి రూపొందుతూ ఉంటాయి. అంటే అక్కడి కణసముదాయాల్లో కొత్తవాటిని పుట్టించుకునే శక్తి ఉందన్నమాట. అయితే ఇలా కొత్త కణాలు ఎక్కువగా పుట్టేందుకు అవకాశం ఉన్నచోటే క్యాన్సర్ కణమూ పుట్టడానికి అవకాశం ఉంది. అలాంటి కణాలపై అధ్యయనం చేస్తున్న సమయంలో అమెరికాలోని యూటీ సౌత్ వెస్టర్న్ మెడికల్ సెంటర్‌లోని సెల్ బయాలజీ విభాగానికి చెందిన అసోసియేట్ ప్రొఫెసర్ డాక్టర్ లారెన్స్ లమ్ అకస్మాత్తుగా ఒక కొత్త అంశాన్ని కనుగొన్నారు. ఎలుకల్లో ఆ యాంటీ క్యాన్సర్ మందును ప్రయోగిస్తున్న సమయంలో గుండె కండరానికి చెందిన కణాలు (కార్డియోమయోసైట్స్) మరింత చురుగ్గా వృద్ధి చెందుతున్నట్లు గుర్తించారు. నిజానికి గుండెకండరాల్లోని కణాలు ఒకసారి చచ్చుబడితే మళ్లీ వృద్ధి చెందవు. అయితే ఈ అధ్యయనంలో ఆ యాంటీ క్యాన్సర్ మందు ఇచ్చిన ఎలుకల్లో గుండె పంపింగ్ సామర్థ్యం పెరిగినట్లుగా కూడా తెలుసుకున్నారు. అంతేకాదు... గుండెపై వచ్చే స్కారింగ్, ఫైబ్రోసిస్ వంటి పరిణామాల్లో తగ్గుదలనూ నమోదు చేశారు. ఈ పరిశోధనల సారాంశాన్ని 'ప్రొసీడింగ్స్ ఆఫ్ నేషనల్ అకాడమీ ఆఫ్ సైన్సెస్'లో ప్రచురించారు. ఈ పరిశోధనల ఫలితాలను సమీక్షిస్తే... గుండెకండరం మళ్లీ పునరుజ్జీవించే అవకాశాలున్నట్లు తెలుస్తున్నందున భవిష్యత్తులో గుండెజబ్బులను పూర్తిగా నయం చేసే విషయంలో ఆశాజనకమైన ఫలితాలు కనిపించవచ్చనే సంకేతాలు వెలువడుతున్నాయని పేర్కొంటున్నారు పరిశోధకులు.

## థర్డ్ హ్యాండ్ స్మోకింగ్‌తోనూ ఎంతో ప్రమాదం!

నేరుగా పొగతాగేవారిని ఫస్ట్ హ్యాండ్ స్మోకర్‌గా పేర్కొంటే... పొగతాగకపోయినా వారి పక్కన ఉండే వారిని ప్యాసివ్ స్మోకర్‌గా చెబుతారు. అయితే ఎవరైనా పొగతాగాక కొద్దిసేపటి తర్వాత ఆ ప్రదేశంలోకి వెళ్లిన వారిని థర్డ్ హ్యాండ్ స్మోకర్స్‌గా చెప్పవచ్చు. స్మోకింగ్ వల్ల థర్డ్ హ్యాండ్ స్మోకర్స్‌కు సైతం ఎంతో ప్రమాదం అంటున్నారు పరిశోధకులు. ఇలా పొగతాగిన చోట ఉండే ఫర్నిచర్‌లోకి పొగలో ఉండే పసుపు స్టెయిన్స్, పొగాకులో ఉండే విషపదార్థాలు పేరుకుపోతాయనీ, వాటి వల్ల థర్డ్ హ్యాండ్ స్మోకర్స్‌కు సైతం ఎంతో ప్రమాదం అంటున్నారు అమెరికాలోని లారెన్స్ బర్కిలీ నేషనల్ లాబొరేటరీకి చెందిన సైంటిస్టులు. ఎవరైనా పొగతాగిన ప్రదేశంలోకి ఎంతోసేపటి తర్వాత చిన్నపిల్లలు వెళ్తే అది ఆ చిన్నపిల్లల రోగనిరోధక శక్తిని దెబ్బతీస్తుందంటున్నారు పరిశోధకులు. థర్డ్ హ్యాండ్ స్మోకింగ్‌పై జరిగిన పరిశోధనలు కాస్త తక్కువేగానీ... ఇటీవల ఈ విషయంలో



నిర్వహించిన పరిశోధనల వల్ల పొగతాగిన ప్రదేశంలోకి చాలాసేపటి తర్వాత వెళ్లిన చిన్నపిల్లలు బరువు తగ్గిపోతారని, వారిలోని ఇమ్యూనిటీ తగ్గడం వల్ల పిల్లలు భవిష్యత్తులో అనేక అనారోగ్యాల బారిన పడతారని పరిశోధకులు హెచ్చరిస్తున్నారు. అంతేకాదు పిల్లల్లో రక్తకణాల సంఖ్య తగ్గే ప్రమాదం కూడా ఉందంటున్నారు. పొగాకు నుంచి వెలువడ్డ ప్రమాదకర రసాయనాలు అక్కడే చాలాసేపు పేరుకొని ఉండటం వల్ల ఈ దుష్పరిణామాలు హెచ్చరిస్తున్నారు డాక్టర్ ఆంటోనీ స్నిడ్జర్స్ అనే శాస్త్రవేత్త. థర్డ్‌హ్యాండ్ స్మోకింగ్ ప్రభావం గర్భవతుల్లో సైతం ఉంటుందనీ, పిండం ఎదుగుదలపై థర్డ్‌హ్యాండ్ స్మోకింగ్ దుష్ప్రభావాలు ఉంటాయని పేర్కొంటున్నారు. పొగ వల్ల కలిగే దుష్ప్రభావాలు థర్డ్ హ్యాండ్ స్మోకర్స్‌పైనే ఇంతగా ఉంటే ఇక నేరుగా పొగతాగే వారిలో ఎంతగా ఉంటాయో ఊహించుకోవచ్చంటూ హెచ్చరికలు చేస్తున్నారు శాస్త్రవేత్తలు.

• న్యూ ఫేస్

# పుదీనా మెరుపు

ఏ కాలమైనా.. మేను మెరుపుని కోరుకోని మగువలుండరు. చలికాలంలో మాత్రం... చర్మానికి ఎన్ని మెరుగులు అద్దినా అతి తక్కువ సమయంలోనే కాంతి హీనంగానే మారిపోతుంది. దీంతో మార్కెట్‌లో దొరికే సౌదర్యలేపనాలకే ఓటేస్తారు చాలా మంది మహిళలు. అయితే కెమికల్ ప్రొడక్ట్స్ కంటే.. ప్రకృతి లేపనాలే సరైన ఔషదాలంటున్నారు నిపుణులు. సాధారణంగా స్త్రీలను వేధించే మొటిమలు, నల్లటి మచ్చలను



పోగొట్టుకోవాలంటే.. పుదీనా పూత పూయాల్సిందే అంటున్నారు. గుప్పెడు వేస్తే చాలు, కూర మొత్తానికీ, సువాసననీ, కమ్మదనాన్ని ఇచ్చే పుదీనా ఆకులు.. స్త్రీల అందాలను రెట్టింపు చేస్తాయి.

పుదీనా ఆకులను మెత్తని గుజ్జుగా చేసుకుని, అందులో ఒక టీ స్పూన్ తేనె, ఒక టీ స్పూన్ మీగడ కలుపుకోవాలి. అందులో చిటికెడు పసుపు కలుపుకుని... ఆ మిశ్రమాన్ని ముఖానికి, మెడకు పూతగా వేసుకోవాలి. 20 నిమిషాల తర్వాత గోరువెచ్చని నీటితో శుభ్రం చేసుకోవాలి. ఇలా ఒక వారం రోజులు క్రమం తప్పకుండా చేస్తే ఫలితం కనిపిస్తుంది. యాంటీసెప్టిక్ సుగుణాలు ఉన్న ఈ పుదీనా ఆకులను ఇప్పుడు చాలా రకాల సౌందర్య ఉత్పత్తుల్లో కూడా వాడుతున్నారు.

• కిసుక్కు



అప్పారావు: నీ వయసు ఎంత?

సుబ్బారావు: 25

అప్పారావు: గతంలో కూడా ఇదే మాట చెప్పావు!

సుబ్బారావు: మాట మార్చే అలవాటు మా ఇంటా వంటా లేదు.

– బి.రవి, రాజమండ్రి

• మీకు తెలుసా ?

ఉరుగ్వే మాజీ అధ్యక్షుడు జోస్ ముజికకు 'పూరెస్ట్ ప్రెసిడెంట్'గా పేరు. నెల జీతంలో



90 శాతం ఛారిటీలకు ఇచ్చేవాడు. తనకు జబ్బు చేస్తే ప్రభుత్వ ఆస్పత్రికి వెళతాడు.

• నెయిల్ ఆర్ట్

# బ్లూ రోజ్ నెయిల్స్

**గు**లాబీలను ఇష్టపడని వారుండరు. అవే గులాబీలు గోళ్లపై ఉంటే ఇంకా అందంగా ఉంటుంది కదా. అందులో వైట్, బ్లూ కలిసి ఉన్న రంగులను అసలు వదిలి పెట్టరు. అందుకే మరో కొత్త నెయిల్ పాలిష్‌ను పరిచయం చేస్తున్నాం. మరి గోళ్లమీద తెల్లని నెయిల్ పాలిష్‌పై బ్లూ కలర్ గులాబీలను పూయిద్దామా....

దీనికి కావాల్సినవి... బ్రైట్ వైట్, వెడ్జ్‌వుడ్ బ్లూ కలర్ల నెయిల్ పాలిష్‌లు, ఎక్రైలిక్ పెయింట్స్ (డార్క్ బ్లూ, వైట్)లను తీసుకోవాలి.




1. ముందుగా గోళ్లను శుభ్రం చేసుకుని అందంగా కట్ చేసుకోవాలి. మొదటగా వైట్ నెయిల్ పాలిష్‌ను అప్లయ్ చేసుకోవాలి.
2. బాగా ఆరిన తర్వాత దానిపై బ్లూ ఎక్రైలిక్ పెయింట్‌తో గులాబీ అవుట్ లైన్‌ను అప్లయ్ చేయాలి.
3. ఒక స్క్వేర్ బ్రష్‌కు ఒకవైపు పేల్ బ్లూ, మరోవైపు డార్క్ బ్లూ అప్లయ్ చేసుకుని పక్కన పెట్టుకోవాలి.
4. మొదటగా గీసిన గులాబీ అవుట్ లైన్‌పై లైట్ బ్లూ కలర్‌తో పువ్వు రెమ్మలు వచ్చే విధంగా అవుట్ లైన్ గీయాలి. తర్వాత డార్క్ బ్లూతో లోపల గీయాలి. బొమ్మలో చూపించిన విధంగా రోజ్ తయారవుతుంది.
5. దాని లోపల ఇంకా కొన్ని రెమ్మలు కనిపించాలంటే పైన చెప్పిన విధంగా అప్లయ్ చేసుకుంటే వైట్ నెయిల్ పాలిష్ మీద బ్లూ కలర్ గులాబీలు తయారవుతాయి. మీ గోళ్లు గులాబీలతో మెరిసిపోతాయి.
6. చివరగా మీకిష్టమైతే గ్లిట్టర్ నెయిల్ పాలిష్‌ను అప్లయ్ చేసుకోవచ్చు. పై వరకు చాలనుకుంటే వేసుకోకుండా ఉంటే కూడా బాగుంటుంది.

నిర్వహణ: ఝూన్సీ కొడవటి

• కవర్ స్టోరీ

ఫిబ్రవరి 14 ప్రేమికుల దినోత్సవం

# లవ్ బిజినెస్

**రెడ్ రోస్.. ప్రేమకు చిహ్నం! దాని ఖరీదు ఎంతో తెలుసా? ఒకే ఒక్క రోజా పువ్వు ధర..ఒక్క రోజు వంద రూపాయలు!**
**టెడ్డీబేర్.. ప్రియురాలికి ఇష్టమైన సాఫ్ట్ టాయ్.. జానెడు బొమ్మ వెల ఆరడుగుల ప్రియుడిని బేర్‌మనేలా చేస్తోంది!**
**లవర్స్‌ను ఊరించే కానుక ఉంగరం! కాని దాని కాస్ట్ ఇమిటేషన్స్‌లోనే వేలు పలుకుతుంటే ఖంగుమంటున్నారు!**
**పెర్ఫ్యూమ్.. ప్రేమికులను దరిచేర్చే పరిమళం! ఒక్క స్ప్రేతో లవ్‌ను లాక్కుందామనుకుంటే ప్రైస్ ట్యాగ్ ముందుకు ప్రొసీడ్ కాకుండా లాక్ చేస్తోంది!**
**ఏ శుభకార్యాన్నయినా తీపితో మొదలుపెట్టడం మన ఆనవాయితీ!**
**అందుకే ఐ లవ్యూ అనే మంచి మాటను తియ్యగా చెబుదామంటే చాక్‌లేట్ ధర చేదు రుచిని తలపిస్తోంది!**
**ఇక్కడ ఉదాహరణలే కాదు కానుకలనే ఊహల వెల కూడా ఆకాశానికి ఉయ్యాలేసి లవ్‌బర్డ్స్‌ను ఊరిస్తోంది అందుకోమని!**
**తమ ప్రెషస్ ప్రేమ పారామీటర్ వందలు దాటి వెలకు చేరుతోంటే పట్టుకోవడానికి ప్లాన్ వేసుకుంటున్నారు ప్రేమికులు! అదే అదను అని సొమ్ము చేసుకుంటున్నారు వ్యాపారులు! ఇది ప్రేమికుల రోజు కథ.. వాలంటైన్స్ డే స్పెషల్!**

ప్రేమించడానికి మనసుంటే సరిపోతుంది.. కానుకలెందుకు? బ్లాక్ అండ్ వైట్ కాలంనాటి మాట ఇప్పుడు చెల్లదండీ! ఏ కానుకల్లేకుండా ప్రేమను పేలవంగా చెప్తే ఏం బాగుంటుంది? గిఫ్ట్స్‌తో గుబాళించాలి! అప్పుడే అవతలి వాళ్లు అట్రాక్ట్ అవుతారు అనేది కొత్త కాన్సెప్ట్! ప్రేమించడానికి ఇటు అబ్బాయిల జేబు, అటు అమ్మాయిల పర్స్ రెండూ నిండుగానే ఉండాలి. నిండుకుంటే లవ్ వే గేట్స్ మూసేసుకుంటుంది. వాలెంటైన్ జానపద గాథను ప్రేమకు చిరునామాగా మలచి వ్యాపారులు ఆ దారిని పరిస్తే మీడియా ట్రెండ్‌గా పాపులర్ చేసింది! ప్రేమికులు బ్లైండ్‌గా ఫాలో అవుతున్నారు! అందుకే ఇంతకుముందు గుట్టుచప్పుడు కాకుండా సాగిన ప్రేమాయణం ఇప్పుడు కాస్ట్లీ వ్యవహారంగా సందడిచేస్తోంది.. కాసులను ఖర్చుపెట్టిస్తోంది. వ్యాపారుల పంట పండిస్తోంది.

**ఎర్ర గులాబీ గుసగుసలు**

అన్ని దేశ్‌లాగే పాశ్చాత్య ప్రపంచం వాలెంటైన్ డేనూ మూడో ప్రపంచం మీదకు వదిలింది. తన లవ్‌బిజినెస్ ఫార్ములాను ఆ దేశాల మార్కెట్‌కూ అందించింది. ఉత్పత్తులను దించింది. వీటికి ఎంత గిరాకీ అంటే ఇండిపెండెన్స్ డే ఇంపార్టెన్స్‌ను మరిచిపోయినా వాలంటైన్స్‌డే సెలబ్రేషన్స్‌ను మాత్రం గుర్తుపెట్టుకుంటోంది యూత్. వ్యాపారులకు కావాల్సిందీ అదే! వాలంటైన్స్‌డేను ఫేమస్ చేయడానికి పెట్టిన ఖర్చును అణాపైసలతో సహా రాబట్టుకుంటున్నాయి ఆ సంస్థలు. ఇదంతా ఓ పథకం.. ప్రణాళిక. వాటి జోలికి పోకుండా వాలంటైన్స్ డే రోజు డిమాండ్‌లో ఉన్న ఉత్పత్తులేంటి? వాటిని మార్కెట్‌లోకి వదిలిన శక్తులేంటో తెలుసుకుందాం!

**ఆ తొమ్మిది కంపెనీలు..**

వాలంటైన్స్ డే లవ్‌బిజినెస్ ఐడియాను క్రియేట్ చేసింది, ఇంప్లిమెంట్ చేసిందీ అమెరికానే! స్వీట్‌నథింగ్స్‌ను కరెన్సీ రేపర్‌లో





## రగులుతోంది చాక్‌లెట్ పొద

ప్రేమలో పడ్డవాళ్లలో బ్రెయిన్‌లో ట్రైప్టోఫాన్, సెరోటోనిన్, ఫెనిలెథిలమైన్, యాంఫెటమైన్ అనే లైగింక రసాయనాలు విడుదలవుతాయి. చాక్‌లెట్ ఈ రసాయనాలను ప్రేరేపించే ఉద్దీపకంగా పనిచేస్తుందని చెప్తారు కొందరు నిపుణులు. అంటే ప్రేమను జ్వలింపజేసే పెట్రోల్ పాత్రను పోషిస్తాయన్నమాట చాక్‌లెట్స్. అందుకే ప్రేమికులు డబ్బాలకొద్దీ చాక్‌లెట్స్ కానుకలుగా ఇస్తారు.. ఆశిస్తారేమో! ఈ నిజాన్నే తన వ్యాపార సూత్రంగా మలచుకుంది అమెరికన్ చాక్‌లెట్ కంపెనీ ది హర్‌షే!

చుట్టి ప్రేమికుల కళ్లబడేలా పేర్చింది. ఈ కష్టానికి క్రెడిట్ అమెరికాలోని 9 కంపెనీల ఖాతాలోనే జమవుతుంది. ది నేషనల్ రిటైల్ ఫెడరేషన్ (అమెరికా) లెక్క ప్రకారం వాలంటైన్స్ డే ఒక్కరోజే ఈ కంపెనీల లాభం లక్షా పదమూడు వేల తొమ్మిది వందల కోట్ల పై మాటే. 1-800 ఫ్లవర్స్, ది హర్‌షే కంపెనీ, హాల్‌మార్క్‌కార్డ్స్, నెకో, వెర్‌మోంట్ టెడ్డీ బేర్, విక్టోరియాస్ సీక్రెట్, టిఫనీ అండ్ కో, అర్మెల్లిని ఎక్స్‌ప్రెస్‌లైన్స్, ది యూఎస్ పోస్టల్ సర్వీస్ మొదలైన 9 కంపెనీలు ఆ జాబితాలో ఉన్నాయి.










### 1-800 ఫ్లవర్స్... మోస్ట్ వాంటెడ్ ఫర్ లవర్స్

ఇది ప్రేమ గులాబీలు అంటే రెడ్‌రోజెస్‌ను, ఇతర కానుకలను అమ్మే సంస్థ. ఒక్క ప్రేమికులరోజు నాడే తన యేడాది ఆదాయం కన్నా పది శాతం అధిక సేల్స్ ఉంటాయి ఈ కంపెనీకి. గిఫ్ట్స్ ఆర్డర్ చేసిన లవర్స్‌కి క్షణం ఆలస్యం చేయకుండా అందించేందుకు వాలంటైన్స్‌డే ఒక్కరోజే అదనంగా ఆరువేల మంది వర్కర్స్‌ను అపాయింట్ చేసుకుంటుందంటే ఎంత డిమాండో అర్థం చేసుకోవచ్చు. ఆ ఖర్చుకి ఆరింతల లాభం వస్తుందని చెప్తాడు 1-800 కంపెనీ సీఈవో జిమ్ మెకాన్. యేటా 40 శాతం మంది కొత్త కస్టమర్స్ కూడా పెరుగుతారట.

### ది హర్‌షే ... కాక పుట్టించే చాక్‌లేట్

ఇది అమెరికన్ పాపులర్ చాక్‌లేట్స్ కంపెనీ. యేడాది మొత్తంలో కన్నా యాభై యాతం అధికంగా వాలెంటైన్స్‌డే రోజు హర్‌షేకి బిజినెస్ ఉంటుందట.

### హాల్‌మార్క్ కార్డ్స్.. గ్రీటింగ్స్‌కే హాల్‌మార్క్

వాలెంటైన్స్ డే గ్రీటింగ్స్ కార్డ్స్‌కి ఈ కంపెనీ ప్రసిద్ధమైంది. దాదాపు పద్నాలుగువందల వాలంటైన్స్‌డే కార్డ్స్ డిజైన్స్‌ను క్రియేట్ చేసింది. స్టాటిస్టిక్ బ్రెయిన్ సర్వే ప్రకారం కిందటేడాది వాలంటైన్స్ డే రోజు 150 మిలియన్ల మంది హాల్‌మార్క్ కార్డ్స్‌ను తమ ప్రేమికులకు పంపారు. క్రిస్మస్ తర్వాత అంత పెద్దమొత్తంలో ఆదాయం తెచ్చిపెట్టేది వాలెంటైన్స్ డేనే అని ఒప్పుకుంటుంది హాల్‌మార్క్ కార్డ్స్ యాజమాన్యం.

### నెకో.. లవ్స్ స్వీట్‌హార్ట్

క్యాండీస్ కంపెనీ. ఇది చతురస్రాకారం, బేస్‌బాల్స్, వాచెస్ ఆకారంలో క్యాండీస్‌ను తయారు చేసినన్నాళ్లు దీనికి పెద్ద గిరాకీ లేదు. ఎప్పుడైతే పిప్పర్‌మెంట్ సైజులో హార్ట్‌షేప్ ఆకారంలో క్యాండీస్‌ను తయారు చేయడం మొదలుపెట్టిందో అప్పటి నుంచి సప్లయ్ చేయలేనంతటి డిమాండ్ పెరిగిందట. దీన్ని వాలెంటైన్స్ డేకి యూఎస్‌పిగా ఎలా మలచుకోవాలో ఆలోచించమని మార్కెటింగ్ స్టాఫ్‌కి ఆర్డర్ వేసింది యాజమాన్యం. ఈ హార్ట్‌షేప్‌లోని క్యాండీస్ మీద ప్రేమికులకు సంబంధించిన సేయింగ్స్, కొటేషన్స్‌ను ముద్రించి మార్కెట్‌లోకి రాసులు పోశారు. జనవరి 1 నుంచి ఫిబ్రవరి 14 వరకు ప్రతిరోజూ ప్రపంచ వ్యాప్తంగా లక్షపౌండ్ల క్యాండీహార్ట్స్‌ను అమ్మి ఆదాయం గడిస్తోంది నెకో!

### వెర్‌మోంట్ టెడ్డీ బేర్.. వాలెంటైన్స్ డిమాండ్

ఈ కంపెనీ టెడ్డి బేర్ వరల్డ్ ఫేమస్. మల్టీ మిలియన్ డాలర్ బిజినెస్ కంపెనీ. వాలంటైన్స్ డే గిఫ్ట్‌గా ఇది తయారు చేసే టెడ్డీకి ఎంత బెట్టంటే ఆర్నెల్ల ముందుగానే ఆర్డర్ ఇచ్చేంత. ఈ పాటికి అర్థమయ్యే ఉండాలి వెర్‌మెంట్‌కి వాలెంటైన్స్ డే బిజినెస్ ఎంతో!

### విక్టోరియాస్ సీక్రెట్.. హాటెస్ట్ గిఫ్ట్

మాయిశ్చరైజర్స్, పెర్‌ఫ్యూమ్స్, లోదుస్తులు తయారు చేసే కంపెనీ ఇది. కాని లోదుస్తులకే బ్రాండ్ నేమ్ సంపాదించుకుంది. వాలెంటైన్స్ డే రోజు పాశ్చాత్య దేశాల్లోని ప్రతి ప్రేమికుడు తన ప్రియురాలికి విక్టోరియాస్ సీక్రెట్ కంపెనీ లో దుస్తులు గిఫ్ట్‌గా ఇచ్చి తన ప్రేయసి మనసెరిగిన ప్రియుడిగా ముద్ర వేయించుకోవాలని తపనపడుతుంటాడట. రిచ్ బాయ్‌ఫ్రెండ్‌గా బిల్డప్ ఇవ్వాలనుకుంటాడట. ఈ లెక్కన ఆ ఒక్కరోజు ఈ కంపెనీ లాభాలెంతో అంచనాకు అందే ఉంటాయి కదా!

**టిఫనీ అండ్ కో.. జ్యుయెలరీ అందుకో**

మొదట ఇది స్టేషనరీ షాప్. తర్వాత వరల్డ్ ఫేమస్ జ్యుయలరీ కంపెనీ. వాలెంటైన్స్ డే రోజు ప్రతి ముగ్గురిలో ఒక పురుషుడు తన ప్రియురాలికో, భార్యకో టిఫనీ అండ్ కో జ్యుయలరీని ప్రెజెంట్ చేయాలనుకుంటాడు. ఆ రోజుకి తన సేల్స్ ఎంతో చెప్పకుండా సీక్రెట్‌గా ఉంచుతుంది ఈ కంపెనీ. బిలియన్లలోనే ఆదాయం ఉంటుందంటారు మార్కెట్ విశ్లేషకులు.

**అర్మెల్లిని ఎక్స్‌ప్రెస్ లైన్స్ .. ప్రేమ డెలివరీ లైన్స్**

పువ్వుల రవాణాలో పేరుమోసిన సంస్థ. వాలంటైన్స్ డే రోజు ఎర్రగులాబీలను పంపిణీ చేయడానికి రెండు నెలల ముందునుంచే సమాయత్తమవుతుంది. అదనంగా ట్రక్ డ్రైవర్స్‌ను నియమించుకుంటుంది. మామూలు రోజుల్లో కన్నా ప్రేమికుల రోజు నాడు నాలుగున్నరరెట్లు ఎక్కువుంటుంది దీని వ్యాపారం!

**ది యూఎస్ పోస్టల్ సర్వీస్.. సందేశాలను మోసుకొచ్చే సర్వీస్**

మెయిల్స్, మొబైల్స్, వాట్సప్ మెస్సేజెస్ ఎన్ని ఉన్నా.. పోస్టల్ సర్వీస్‌లో వచ్చిన చిన్న కార్డుముక్క అందించే ఆనందం వేరు..ఆస్వాదించే దగ్గరి తనం వేరు. ఆ సంప్రదాయాన్నే నిలుపుతోంది ది యూఎస్ పోస్టల్ సర్వీస్. ప్రేమికుల అనురాగ సందేశాలను, ప్రేమ పలుకులను పొదువుకున్న గ్రీటింగ్ కార్డ్స్‌ను పదిలంగా పట్టుకొచ్చి అప్పజెప్పడంలో ది యూఎస్ పోస్టల్ సర్వీస్‌ను మించిన సర్వీసే లేదట. అందుకే వాలెంటైన్స్ డేకి వారం ముందునుంచే బిజీ అయిపోతుంది.. అయిదు నుంచి ఏడు శాతం అధికంగా వచ్చిపడే కార్డ్స్, ప్యాకేజెస్ అండ్ పార్సిల్స్‌తో. క్రిస్మస్ తర్వాత అంత పని, అంతేపెద్ద మొత్తంలో ఆదాయమూ వచ్చే పండగ ప్రేమికుల పండగే అని సంబరపడ్తోంది ఈ పోస్టల్ సర్వీస్ సంస్థ.

**నాట్ ఓన్లీ ఫర్ కపుల్స్..**

పాశ్చాత్య సమాజంలో వాలెంటైన్స్ డేను కేవలం జంటలే కాదు ఇతర కుటుంబ సభ్యులు, స్నేహితులు, క్లాస్‌మేట్స్, టీచర్లు కూడా సెలబ్రేట్ చేసుకుంటారు. గిఫ్ట్స్ ఇచ్చిపుచ్చుకుంటారు. ఈ ధోరణి ఈసారి ఆసియా దేశాల్లోనూ కనిపించే అవకాశం ఉంది.

## దేనిమీద ఎంతెంత?

**ఫ్లవర్స్..** 3 బిలియన్ డాలర్లు (మన దగ్గరైతే ఒక రోజాపువ్వు మామూలురోజుల్లో 15 రూపాయలుంటే ఫిబ్రవరి నెలలో వంద నుంచి మూడువందల రూపాయలు, ఫిబ్రవరి 14న అయితే రూ. 500 కూడా ఉంటోంది)

జ్యుయెలరీ.. 5.5 బిలియన్ డాలర్లు, డేట్ కోసం.. 4.5 బిలియన్ డాలర్లు, వాలెంటైన్స్ డే రోజు అమెరికా జనాలు తమ పెంపుడు జంతువులను బయటకు తీసుకెళ్లడం, వాటికి గిఫ్ట్స్ కొనివ్వడం చేస్తారు. వీటి కోసం తమఆదాయంలో దాదాపు 20 శాతం ఖర్చు చేస్తారు.

## ఇష్క్ కిత్నా మెహంగా హై

కిందటేడాది ఒక సాధారణ అమెరికా పౌరుడు వాలెంటైన్స్ డే రోజు తన గర్ల్‌ఫ్రెండ్‌కు ఇచ్చే గిఫ్ట్ కోసం రెండువందల డాలర్లు అంటే దాదాపు పదమూడున్నరవేల రూపాయలను ఖర్చుపెట్టాడట. అమ్మాయిల కన్నా రెండింతలు ఎక్కువ కాస్ట్లీ గిఫ్ట్స్ ఇస్తున్నారట అబ్బాయిలు. కిందటేడాది 22 బిలియన్ డాలర్ల బిజినెస్ అయితే ఈ యేడాది 25 బిలియన్ డాలర్లకు పెరగొచ్చని అంచనా. అయితే మిగిలిన దేశాలూ వాలెంటైన్స్ డే ట్రెండ్‌ను ఫాలో అవడంలో అమెరికాతో పోటీ పడుతున్నాయి.

## యమ ఆనందం

నాకు బెంగళూరు దగ్గర 230 ఎకరాల గులాబీ తోట ఉంది. అతిపెద్ద గ్రీన్‌హౌజ్ గులాబీ తోటల్లో నాదీ ఒకటి. వాలెంటైన్స్ డే వస్తుందంటే చాలు యమ ఆనందం. మిగిలిన రోజుల్లో కంటే పదిరెట్లు ఎక్కువుంటుంది ఆ రోజున బిజినెస్. డిమాండ్‌ను బట్టి రేట్లుంటాయి.

- ఫరాజ్ అహ్మద్, డైరెక్టర్, తాన్‌ఫ్లోరా ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ ప్రైవేట్ లిమిటెడ్.

## ఇక్కడా పెద్ద పండగే

2015 వాలెంటైన్స్ డే ఆన్‌లైన్ మార్కెటింగ్‌ను బాగా పెంచింది. కార్డ్స్, పూలు, డైమండ్ నగలు, చాక్‌లేట్స్, బొమ్మలు, రెడీమేడ్ దుస్తులు, మొబైల్ ఫోన్లు, ఎలక్ట్రానిక్ గాడ్జెట్స్, రిస్ట్‌వాచీలు మొదలైనవాటికి సంబంధించి దాదాపు 22 వేల కోట్ల రూపాయల ఆన్‌లైన్ అమ్మకాలు సాగినట్టు అసోచామ్ వెల్లడించింది. ఇవి రికార్డ్‌స్థాయి సేల్స్ అని పేర్కొంది. ఇంకెన్నో కార్పోరేట్, ఆన్‌లైన్ షాపింగ్ కంపెనీలు వాలెంటైన్స్‌డే కానుకల ఉత్పత్తిలోకి అడుగుపెట్టాయి. 'గత అయిదేళ్లుగా వాలెంటైన్స్ డే మన దగ్గరా అత్యధిక సేల్స్ ఉన్న పండగగా మారింది' అంటారు అసోచామ్ సెక్రటరీ జనరల్ డి.ఎస్. రావత్. ఇక్కడ వాలెంటైన్స్ డే గిఫ్ట్స్ కోసం స్టూడెంట్స్ కన్నా ఎమ్ఎన్‌సీ, బీపీఓ, ఐటీ సెక్టార్స్‌లో పనిచేసే ఎంప్లాయ్స్ ఎక్కువ ఖర్చు చేస్తున్నారు. స్టూడెంట్స్ అయిదు వందల రూపాయల నుంచి పదివేల లోపు ఖర్చుపెడితే.. సాఫ్ట్‌వేర్ గట్రా ఉద్యోగులు వెయ్యినుంచి 50 వేల రూపాయల దాకా ఖర్చు చేస్తున్నారని అసోచామ్ రిపోర్ట్ చూపిస్తోంది.

## మన గులాబీలకే గులాములు

వాలెంటైన్స్‌డే రోజు ఎన్ని వెరైటీ గిఫ్ట్స్ క్యూలో ఉన్నా గులాబీ రాణిని తోసిపుచ్చేవి రాలేదు ఇప్పటివరకు. ఎంత ఖరీదు కానుకనైనా ఎర్రగులాబీ తోడులేందే యాక్సెప్ట్ చేయదు ప్రేమరాణి. అందుకే గులాబీలు గుంబనంగానే హైప్ అవుతున్నాయి. అందునా మన గులాబీలకే గులాములు అందరూ! "ఫారిన్ మార్కెట్ ముఖ్యంగా యూకేలో మన దేశీ గులాబీల గుబాళింపునే ఆఘ్రాణిస్తున్నారు. నిరుడు ఫిబ్రవరి 1 నుంచి 20 వతేదీ వరకు మనం 19 మిలియన్ల గులాబీ పూలను యూకేకు ఎగుమతి చేశాం. యూకేతో పాటు ఆస్ట్రేలియా, జపాన్, పశ్చిమాసియా దేశాలు కూడా మన రోజాలంటేనే మనసుపారేసు కుంటాయి "ని చెప్తున్నారు 'ఇండియన్ సొసైటీ ఆఫ్ ఫ్లోరీకల్చర్ ప్రొఫెషనల్స్' ప్రెసిడెంట్ ప్రవీణ్ శర్మ.

## డిమాండెడ్ గిఫ్ట్స్

అబ్బాయిల కోసం అమ్మాయిలు బ్రాండెడ్ బట్టలు, సిల్వర్ కఫ్లింగ్స్, పట్టు 'టై'లు, లెదర్ బెల్టులు, వాలెట్, కీ చైన్స్‌ను బహుమతిగా ఇస్తున్నారు. అబ్బాయిల నుంచి వీటికే డిమాండ్ ఎక్కువగా ఉంటోంది. ఇవన్నీ దాదాపు 12 వేల నుంచి 15 వేల రూపాయల ధరున్నవే. అబ్బాయిల దగ్గర అమ్మాయిల డిమాండేమో డైమండ్ జ్యుయెలరీ, రిస్ట్‌వాచ్‌లు, స్మార్ట్‌ఫోన్స్, బ్రాండెడ్ బట్టలు, బ్రాండెడ్ చెప్పులు, ఇంటర్నేషనల్ బ్రాండెడ్ హ్యాండ్ బ్యాగ్స్, వాలెంటైన్స్ డే డేట్, వాలెంటైన్ డే టూర్స్‌కి ఉంటోంది.

## వాలెంటైన్స్ వీక్

వాలెంటైన్స్ డేను ఓ వారం ముందే మొదలుపెట్టి లవ్‌కార్నివాల్‌గా పిలుచుకోవడమే కాదు ఆ సంబరాలను జరుపుకుంటున్నాయి ప్రేమపక్షులు. ఫిబ్రవరి 7న మొదలై వాలెంటైన్స్‌డే అయిన 14వతేదీన ముగుస్తున్నాయి. ఫిబ్రవరి 7 రోజ్‌డే.., 8. ప్రపోజల్ డే, 9.చాక్‌లెట్ డే, 10. టెడ్డీ డే, 11.ప్రామిస్ డే, 12. కిస్ డే, 13. హగ్ డే, 14. వాలెంటైన్స్ డే! ఒక్కో రోజుకి ఒక్కో గిఫ్ట్ ఉంటుంది.



## వాలెంట్సైన్స్‌డే డెస్టినేషన్స్

గిఫ్ట్స్ తయారు చేసే కార్పొరేట్ సంస్థలు, ట్రావెల్ హౌజెస్ ప్రేమికుల రోజు కోసం కేరళ, గోవా, నైనిటాల్, మౌంట్ అబు, డెహ్రాడూన్, ముస్సోరి, కసౌలి, షిమ్లా, పంచవటి మొదలైన ప్రదేశాలకు ప్రత్యేక టూర్ ప్యాకేజ్‌లను అందిస్తున్నాయి. వీటి ధర ఆరు వేల నుంచి అరవై వేల రూపాయల వరకు ఉంటోంది. వాలెంటైన్స్ డే పిచ్చిని ఎయిర్‌లైన్స్ సంస్థలూ సొమ్ము చేసుకుంటున్నాయి. విమాన చార్జీల్లో రాయితీలుస్తూ స్పెషల్‌హాళిడే ప్యాకేజేస్‌తో గాల్లో విహరింపచేస్తున్నాయి.

## వాలెంట్సైన్స్ డే కథ

నిజానికి ఇది ప్రేమపక్షుల కథ కాదు. స్నేహం కథ! తల్లిదండ్రులు–బిడ్డలు, అక్కాచెల్లెళ్లు, అన్నాదమ్ములు, స్నేహితులు, రాజు – పేద, యజమాని– ఉద్యోగి మధ్య స్నేహాన్ని, ప్రేమను పెంచే కథ.. ఒక్క మాటలో చెప్పాలంటే ప్రపంచాన్ని ప్రేమమయం చేయమని చాటే ఓ సెయింట్ కథ. మూడో శతాబ్దంనాటి గ్రీకు కథ. రోమ్ చక్రవర్తి అయిన క్లాడియస్ 2 .. తాను నమ్మే పన్నెండు దేవతలను మాత్రమే పూజించాలని రోమన్లందరినీ ఆజ్ఞాపిస్తాడు. క్రిస్టియన్లతో ఎవరైనా సన్నిహితంగా మెదిలారని తెలిస్తే మరణశిక్ష ఖాయమనీ హెచ్చరిస్తాడు. కాని వాలెంటినస్ అనే సాధువు చక్రవర్తి మాటను చెవికెక్కించుకోడు. తన జీవితాన్ని క్రీస్తుకే అంకితం చేస్తాడు. దాంతో కన్నెర్ర చేసిన క్లాడియస్.. వాలెంటినస్‌ను జైల్లో పెట్టి మరణ శిక్ష విధిస్తాడు. ఆయనకు జూలియా అనే కూతురు ఉంటుంది. ఆమె పుట్టుకతో అంధురాలు. వాలెంటినస్ తన కూతురుకి అన్నీ నేర్పిస్తాడు. తనకళ్లతో ప్రపంచాన్ని పరిచయం చేస్తాడు. వారం రోజుల్లో ఆ సాధువుకు మరణశిక్ష అమలవుతుందనగా జైలర్ ఆయన్ని అడుగుతాడు.. 'నీ కూతుర్ని చూడాలనుకుంటున్నావా?' అని. పిలిపిస్తాడు. జైల్లోంచే తన కూతురుకి జీవన సత్యాలు బోధిస్తుంటాడు. ఆ జ్ఞానంతో జూలియాకు చూపు వస్తుంది. చివరకు తాను చనిపోయే ముందు రోజు జూలియాకు ఓ ఉత్తరం రాస్తాడు.. 'దైవాన్ని నమ్ము.. ప్రపంచాన్ని ప్రేమించు.. ఫ్రమ్ యువర్ వాలెంటైన్' అని! ఆ తర్వాత రోజు అంటే క్రీ.శ. 270, ఫ్రిబవరి 14న వాలెంటినస్‌కు మరణశిక్ష అమలవుతుంది. తన తండ్రిని సమాధి చేసిన చోట గులాబిరంగులో పూత పూసే బాదం మొక్క నాటుతుంది ఆమె. ఆ మొక్క తర్వాత కాలంలో వృక్షమై ప్రేమ, స్నేహానికి చిహ్నంగా నిలిచింది అంటారు. ఆ ప్రేమను, స్నేహాన్ని ప్రపంచానికి చాటడానికే ప్రతి ఫిబ్రవరి 14న వాలెంటినస్ పేరుమీద వాలెంటైన్స్ డేని జరుపుకోవడం మొదలుపెట్టింది ప్రపంచం.

వాస్తు వీక్షణం


వాస్తు విద్వాన్, సాయిశ్రీ

గౌ॥డా॥ దంతూరి పండరీనాథ్




### ఉద్ఘాటితకవాట వేధ

ద్వార బంధ ప్రతిష్ట మరియు ద్వారములు బిగించుట సరైన క్రమములో నుండవలయును. ద్వారములు వేసినప్పటికీ వాటంతటవే తెరుచుకోకూడదు. అలా తెరుచుకోవటం వాస్తు దోషమవుతుంది. 'ఉన్మాదః స్వయముద్ఘాటితే' అను శాస్త్ర వచనము కలదు. అంటే ఈ దోషము కల గృహము వలన ఆ గృహ యజమానికి గానీ అందు నివసించు వారికి గాని మానసిక రుగ్మతలు కలుగు అవకాశము కలదు. ఒక వేళ ఎవరికైనా ఉన్మాదము, లేద మానసిక రుగ్మతలు ఉన్నట్లయితే, ఏ మందులకు తగ్గకపోతే, వారి గృహము యొక్క ద్వారములు పైన ఉదహరింపబడిన దోషము కలిగి ఉన్నదేమోనని ఒకసారి పరిశీలింపవలెను. అట్టి దోషము ఉన్నట్లయితే వారి సమస్యల కారణము ఈ వాస్తు దోషమేనని నిర్ధారించుకోవచ్చును. మూసిన తలుపులు తామంత తామే తెరవబడక స్థిరముగా నుండునట్లు సరిచేసినట్లయితే దోషము సరిదిద్దబడుతుంది. వారి సమస్య కూడా క్రమముగా పరిష్కరింపబడునవకాశము కలుగుతుంది.

### ఉత్తరమును పెంచుకోవచ్చా...

ఆగ్నేయంలో ప్రహారికి ఆనించి మెట్లు, ఉత్తరం ప్రహారికి ఆనించి బాత్‌రూమ్, లెట్రిన్ ఉన్నవి. వాయువ్యంలో గడప ఉన్నది. మేము ఉత్తరమును పెంచుకోవాలనుకుంటున్నాము. వాస్తు రీత్యా ఏ విధంగా చేయాలి? తెలుపగలరు.

– భరత్‌సాంగ్, కావలి.

ఆగ్నేయంలో మెట్లు కట్టుకోవచ్చును. కాని తూర్పు ఆగ్నేయం ప్రహరీ గోడకు ఆనించి కట్టకూడదు. వాయువ్యంలో టాయిలెట్స్, బాత్‌రూమ్స్ ఏవి కూడా నిర్మించకూడదు. ఆవరణలోని వాయువ్యం మూత వేయకూడదు. ఇంటిని ఉత్తరము పెంచి కట్టవలసి వస్తే అనేక విధాల జాగ్రత్తలు అవసరం. ముఖ్యంగా ప్రస్తుతమున్న గృహము ఏ విధమైన నిర్మాణమో... పెంపుదల కూడా అదే విధమైన నిర్మాణమై ఉండాలి. పెంకుటింటికి రెకుల షెడ్డుతో పెంచకూడదు. అలాగే కుడ్య నిర్మిత గృహానికి పిల్లర్స్‌తో పెంపుదల చేయకూడదు. గృహమును పెంచి కట్టినప్పటికీ ఏ విధమైన వాస్తు నియమోల్లంఘున జరగకూడదు. అందుకని ఇటువంటి పనులు వాస్తు నిపుణుల పర్యవేక్షణలో గావించుకోవటం ఉత్తమము.

### భయంకర స్వప్నాలు

కలల గురించి మీరు తెలిపిన విషయాలు చదివాను. ఒక్కొక్కసారి నాకు భయంకరమైన కలలు వస్తాయి. డ్రాకుల, ఓమన్ మొదలైన సినిమాల్లో ఉండే భయంకరమైన దృశ్యాలు వెంటాడుతున్నట్లే ఉంటుంది. కరెంట్ పోతే ఆ చికటికి విపరీతమైన భయం వేస్తుంది. ఆ కలలకు భయపడి నిద్రలేచాక మళ్ళీ నిద్ర పట్టదు. భయపడుతునే ఉంటాను. నాకు కూడా పరిష్కారం చెప్పండి. గురువుగారు!

– క్రిష్ణమాచారి, కదిరి.

అలా భయంకరమైన కలలుగని లేచాక నిద్రపట్టక ఆందోళనకి గురవటం చాలా సహజం. అలాంటి వాళ్ళు చాలా మంది ఉన్నారు. వారందరి కోసం ఒక చిన్న 'చిట్కా' ఉన్నది. కాబట్టి భయాందోళనలు చెందక నిర్భయంగా ప్రయత్నించి చూడండి. భయంకరమైన కలలు గానీ చెడు కలలుగాని వచ్చి నిద్రా భంగము కలిగిన పిదప నెమ్మదించటానికి కొంత సమయము పడుతుంది. ఆ తరువాత కూడ నిద్ర పట్టక పోయినట్లయితే లేచి శ్రీ ఆంజనేయ స్వామిని మనసు లో ధ్యానించి, కాళ్లు కడుగుకొని, నీటితో కళ్ళు తడుపుకొని తిరిగి నిద్రకుపకరించండి. అప్పటికీ నిద్ర పట్టక పోయినట్లయితే 'హరే కృష్ణ, హరే కృష్ణ, కృష్ణ కృష్ణ హరే హరే! హరే రామ, హరే రామ, రామ రామ హరే హరే!!' అను కలియుగ మహా మంత్రమును మనసులోనే 11 సార్లు ఉచ్ఛరించుకుంటు ఉండాలి. అంత లోపలే గాఢ నిద్రకు లోనవటం తథ్యం.

వచ్చేవారం... 'పిహిత కవాట వేధ'




మీ ప్రశ్నలు పంపించవలసిన చిరునామా: వాస్తుసాయి సేవా ఆశ్రమం

వాస్తు వీక్షణం, 3-2-4, కింగ్స్‌వే, రాష్ట్రపతి రోడ్, సికింద్రాబాద్ - 500003.

For Personal Visits & Appointments

Cell: 988 544 6501, 988 544 9458

Ph : 040 - 2781 7446, email : saisreevasthu@gmail.com

● ఉత్తమ విలన్

> నన్నే మోసం చేస్తావారా?
> బొమ్మ పడితే వదిలేస్తా
> బొరుసు పడితే నరికేస్తా

# నాతోనే గేమ్సా?!

ఇటీవలి కాలంలో దక్షిణాది చలనచిత్రరంగంలో చెడ్డ 'విలన్' పాత్రలకు మంచి పేరు తెచ్చుకుంటున్న నటుడు ఆదిత్య మీనన్. 'సింహా' సినిమాలో గోపి పాత్రతో తెలుగు ప్రేక్షకులకు సుపరిచితుడయ్యాడు ఆదిత్య. ఆ సినిమాలో అతనికి చాంతాడు పొడుగు, బీభత్సమైన డైలాగులేమీ ఉండవు.

**'ఎవడ్రా కొట్టింది?'**

**'వాడి పేరు తెలుసా?'**

**'మనం వచ్చిన పనేమిటి? ఈ గొడవేమిటి?'**

**'చేతికి దొరికిన వాడ్ని వదిలేశానురా'.....**

ఇలా పొడి పొడి డైలాగులతోనే వీర లెవెల్లో విలనిజాన్ని పండించాడు ఆదిత్య.

తక్కువ మాటలతో ఎక్కువ నటనను ప్రదర్శించే ఆదిత్య నటనను గమనిస్తే, విలన్ల గురించి ప్రముఖ మాట ఒకటి చప్పున గుర్తుకొస్తుంది.

**'మా దగ్గర ప్లాన్‌లు తప్ప డైలాగులు లేవు.**
**మా దగ్గర ప్రాబ్లమ్స్ తప్ప సొల్యూషన్స్ లేవు'**



కొత్తకొత్తగా
18వ పేజీలో

బాడీ అంతగా లేకపోయిన...డైలాగులు, హావభావాలతోనే భయపెట్టడం ఒక రకం. ఉదాహరణకు... రఘువరన్‌లాంటి వాళ్లు.

నటనలో పస లేకపోయినా...ఒడ్డూ పొడుగుతోనే భయపెట్టడం రెండో రకం.

రెండో రకం విలన్లు పెద్దగా కాలానికి నిలవరు. విలన్‌కు ఒడ్డూ పొడుగు, మంచి శరీరసౌష్ఠవం అవసరమేగానీ అవి మాత్రమే ఉత్తమ విలన్‌కు ప్రామాణికాలు కాలేవు. అందుకే...విలన్ జిమ్‌లోనే కాదు 'మైండ్ జిమ్'లో కూడా గడపాలి. మానసిక కసరత్తు ఎంత బాగా జరిగితే నటన అంతగా మెరుస్తుంది.

ఆదిత్య మీనన్ మంచి ఒడ్డూ, పొడుగు ఉన్న నటుడు. దీనికి తనలోని నటన కూడా తోడుకావడంతో విలన్ పాత్రలను సునాయాసంగా పోషించగలుగుతున్నాడు. సౌత్ ఫిల్మ్ ఇండస్ట్రీలో 'ఉత్తమ విలన్'గా రాణించగలుగుతున్నాడు.

●●●

ముంబాయిలో జన్మించాడు ఆదిత్య మీనన్. కొంత కాలం తరువాత అతడి కుటుంబం దుబాయికి వలస వెళ్లింది. దుబాయిలోని 'అవర్ ఓన్ ఇంగ్లీష్ హైస్కూల్'లో పాఠశాల విద్యను పూర్తి చేశాడు ఆదిత్య. పద్దెనిమిది సంవత్సరాల వయసు వరకు దుబాయిలోనే ఉన్నాడు. ఆ తరువాత కుటుంబ సభ్యులతో పాటు బెంగళూరుకు వచ్చాడు.

బెంగళూరులోని 'యం.ఎస్.రామయ్య ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ'లో ఇంజనీరింగ్ చేశాడు.

కాలేజీలో 'రేడియో మిడ్‌డే'లో రేడియో హోస్ట్‌గా మీడియా రంగంలోకి ప్రవేశించాడు. ప్రాడక్ట్ లాంచ్, ఫ్యాషన్ షోలాంటి లైవ్ ఈవెంట్స్‌కు హోస్టింగ్ చేశాడు.

ఇంజనీరింగ్ పూర్తయిన తరువాత ఈవెంట్ మేనేజర్‌గా కొంతకాలం పనిచేశాడు. ఈ సమయంలోనే ఒక థియేటర్ గ్రూపులో చేరి కొన్ని నాటకాల్లో నటించాడు. ఒకసారి ఆదిత్య నటన ప్రకాష్ బేలవాడి కంటపడింది.

బెంగళూరుకు చెందిన ప్రకాష్ బేలవాడి జర్నలిస్ట్ మాత్రమే కాదు... నాటకాలు, సినిమా, టీవీలలో నటుడిగా మంచి పేరు ఉంది. సామాజిక, కళారంగాలకు సుపరిచితమైన పేరు ప్రకాష్ బేలవాడి.

ఆదిత్య నటనను చూసి ''ఈ కుర్రాడిలో స్పార్క్ ఉంది'' అనుకున్నారు ప్రకాష్.

అలా ప్రకాష్ తీసిన ఒక టీవీ సీరియల్‌లో నటించే అవకాశం వచ్చింది ఆదిత్యకు. ఇదే సమయంలో ప్రముఖ కమెడియన్ యస్.కె.చంద్రు దర్శకత్వం వహించిన 'సూర్య శిఖరి' టీవీ సీరియల్‌లో నటించే అవకాశం వచ్చింది.

నాటకాల్లో నటించాడు.

టీవీలో నటించాడు.

ఇక వెండితెరపై తన అదృష్టాన్ని పరీక్షించుకోవడానికి 2001లో చెన్నైకు వెళ్లాడు ఆదిత్య.

అవకాశాలు రాకో, మరే కారణమో తెలియదుగానీ చెన్నైకి వెళ్లిన తరువాత మళ్లీ బుల్లితెర మీద కనిపించాల్సి వచ్చింది. అలా రాడాన్ మీడియా వర్క్స్ నిర్మించిన 'తంతిర భూమి' సీరియల్‌లో నటించాడు. ఈ సీరియల్ సన్ టీవీలో ప్రసారమైంది. ఆ సమయంలోనే ప్రఖ్యాత దర్శకుడు కె.బాలచందర్ దర్శకత్వం వహించిన టీవీ సీరియల్ 'అన్నీ'లో నటించే అవకాశం వచ్చింది.

'ఆంజనేయ' 'జేజే' సినిమాల్లో నటించే అవకాశం రావడం, ఈ రెండు సినిమాలు ఒకేరోజు విడుదల కావడంతో తమిళ్ ఫిల్మ్ ఇండస్ట్రీలో నలుగురి దృష్టిలో పడే ఛాన్స్ దొరికింది. సినిమాల్లో అవకాశాలు రావడం మొదలైంది.

'సింహా' 'బిల్లా' 'దూకుడు' 'ఈగ' 'మిర్చి' 'బలుపు' 'పవర్' 'లయన్' 'రుద్రమదేవి' చిత్రాలతో తెలుగు ప్రేక్షకులకు చేరువైన ఆదిత్యమీనన్ మరిన్ని చెడ్డ పాత్రలతో 'మంచి' నటనను ప్రదర్శించి 'ఉత్తమ విలన్'గా మరింత పేరు తెచ్చుకోవాలని ఆశిద్దాం.

# భక్తి లేని పూజ!

అది అమరావతి. మహేంద్రపురిలోని ఇంద్రభవంతి. రంభ, ఊర్వశి, తిలోత్తమ, మేనకలు సంప్రదాయ వస్త్రాలతో ఒద్దికగా కూర్చుని ఉన్నారు. అష్టదిక్పాలకులు ఆసీనులై ఉన్నారు. దేవగురువు బృహస్పతి ఉచితాసనాన్ని అలంకరించి ఉన్నాడు. గంధర్వులు గానం చేస్తున్నారు. మునులు హోమాలు, యజ్ఞయాగాది క్రతువులలో నిమగ్నమై ఉన్నారు. దేవేంద్రుడు నారాయణ యజ్ఞంలో లీనమై ఉన్నాడు. యజ్ఞపరిసమాప్తి అయింది. ఫలప్రదాత అయిన నారాయణుడు మాత్రం ఆ ఫలాన్ని అందుకోవడానికి రాలేదు. అంతవరకూ యజ్ఞం సజావుగా జరిగిందని సంతోషంగా ఉన్న ఇంద్రుని మోములోని చిరునగవు మాయమై, ఆ స్థానంలో అసంతృప్తి చోటు చేసుకుంది. తనవల్ల ఏమి తప్పిదం జరిగిందోనన్న ఆందోళన మొదలైంది. అసలు తను ఆ యజ్ఞం చేయవలసి వచ్చిన కారణం కన్నుల ముందు కదలాడింది.

ఓ రోజు ఇలాగే తాను పూజ చేస్తున్నాడు. అయితే పక్కనే అప్సరాంగనల నృత్య ప్రదర్శన, శచీదేవి సపర్యలు సాగుతూ ఉన్నాయి. చేతులు, పెదవులు యాంత్రికంగా పని చేసుకుపోతున్నాయి కానీ, మనసు ఏమాత్రం లగ్నం కావడం లేదు. దాంతో బ్రహ్మదేవుడికి ఆగ్రహం వచ్చింది. ''దేవేంద్రా! ఏ పదవిని, భోగాలని చూసుకుని నువ్వు విర్రవీగుతున్నావో, అవే నీకిక నిద్రాహారాలను దూరం చేస్తాయి. ఏ పూజాది క్రతువులపైన అయితే, నీవు మనస్సును లగ్నం చేయలేకపోతున్నావో, అదే పూజలు, జపతపహోమాదులతో శ్రీహరిని మెప్పించి మునులు మహేంద్రపదవిని పొందుతారు. రాక్షసులు నీ మీద దండయాత్రలు చేస్తూ, నీ రాజ్యాన్ని, సింహాసనాన్ని ఆక్రమించుకుంటూ నీకు మనః స్థిమితం లేకుండా చేస్తూ ఉంటారు గాక'' అని శపించాడు. దాంతో ఇంద్రుడికి తన తప్పిదం తెలిసి వచ్చింది. సురాధిపుడంటే నిత్యం నృత్యగానాలు, అప్సరాంగనల సాంగత్యం, సోమరసపానం కాదని, బాధ్యతాయుతమైన పదవి అని, ఎట్టి పరిస్థితులలోనూ పెద్దలను విస్మరించరాదని గ్రహించాడు.

బ్రహ్మ శాపం తిరుగులేనిది. అయితే విష్ణుమూర్తిని వేడుకుంటే కనీసం శాపాంతం అయినా తెలుస్తుందని గురువర్యులు బృహస్పతి సలహా ఇచ్చిన మీదట ఈ పూజాయజ్ఞం తలపెట్టాడు. అంతా అనుకున్నట్లుగా జరిగింది, ఇక శ్రీమన్నారాయణుడు స్వయంగా విచ్చేసి, యజ్ఞఫలాన్ని స్వీకరించడమే తరువాయి అనుకుంటే ఇప్పుడిలా జరిగిందేమిటి? ఇదే సందేహాన్ని గురువర్యుల ముందుంచాడు. అప్పుడు బృహస్పతి ''దేవేంద్రా! ఇప్పుడిక నీవే స్వయంగా వెళ్లి రమాపతిని ప్రార్థించి, సగౌరవంగా తోడ్కొని రావడం ఉత్తమం'' అని సూచించాడు. దాంతో ప్రాణం కుదుటపడింది దేవేంద్రుడికి.

వెంటనే తన పరివారాన్ని వెంటబెట్టుకుని, నారాయణ మంత్రాన్ని స్మరిస్తూ, వైకుంఠానికి వెళ్లాడు. వైకుంఠ ద్వారాలు తెరిచే ఉన్నాయి. పాలసముద్రం తెల్లగా తళతళలాడుతూనే ఉంది.



ఆదిశేషువు తన పాన్పుతో సిద్ధంగానే ఉన్నాడు స్వామికి సేదదీర్చేందుకు. కానీ, నారాయణుడుంటేగా అక్కడ? ఒకవేళ ఆయనగారేమైనా ముక్కంటి వద్దకెళ్లాడేమోనన్న సందేహం వచ్చింది ఇంద్రుడికి. దాంతో అటునుంచి అటే కైలాసానికి పయనమయ్యాడు.

వెండికొండలు మిలమిలా మెరిసిపోతున్నాయి. మలయ మారుతం వీస్తోంది. సతీదేవి అద్భుతంగా గానం చేస్తుండగా, ఆనంద పారవశ్యంతో తాండవమాడుతున్నాడు శివయ్య. ఓం నమశ్శివాయ అంటూ భక్తితో దణ్ణం పెట్టి, తాము వచ్చిన కారణాన్ని విన్నవించారు స్వామికి. తళతళలాడుతున్న అర్ధనిమీలిత నేత్రాలను మెరిపిస్తూ కేశవుడి జాడ తనకు తెలిసినట్లుగా తెలియజెబుతూనే, మూసి ఉన్న మూడవకన్నును అటూ ఇటూ ఆడిస్తూ, ''నారాయణుడి జాడను కనిపెట్టడం అంత సులువేమీ కాదు, నీవే వెళ్లి వెదుకు'' అంటూ తిరిగి ధ్యానంలో మునిగిపోయాడు ఈశ్వరుడు.

దాంతో అటునుంచి అటే సత్యలోకానికి వెళ్లాడు శచీపతి. వీరి రాకను ముందే గమనించినట్లుగా బ్రహ్మదేవుడు తన దర్శనభాగ్యం కూడా కల్పించకుండానే ''ఇంద్రా! నీవు వెంటనే భూలోకానికి వెళ్లి, అన్వేషించు శ్రీహరి నీకు కనిపిస్తాడు'' అంటూ సరస్వతితో చెప్పించాడు.

ఉస్సురనుకుంటూ ఇంద్రుడు, పరివారమూ దివినుంచి భువిలో అడుగుపెట్టారు. అక్కడ అన్నిచోట్లా శ్రీహరి నిలువెత్తు కాంస్య విగ్రహాలు, పటాటోపపు పూజలు, ధగద్ధగాయ మానంగా మెరిసిపోతున్న రజత, సువర్ణ విగ్రహాలు దర్శనమిస్తున్నాయి కానీ శ్రీహరి జాడ మాత్రం లేదు. ఇంతలోనే శ్రీమన్నారాయణుని లీలాగానం దివ్యంగా చెవిసోకింది. దాంతో దృష్టి అటు సారించి విస్మయంతో, తన కన్నులను తానే నమ్మలేనట్లుగా చూశాడు దేవేంద్రుడు. అక్కడ ఒక చర్మకారుడి చేతులు మాత్రం ఎవరివో చెప్పులు కుడుతున్నాయి. మనస్సు, వాక్కు మాత్రం శ్రీహరి మీదనే లగ్నమై, దివ్యంగా గానం చేస్తున్నాడు. మైమరచిపోయి వింటూ, పారవశ్యంతో తలపంకిస్తున్నాడు హరి.

అప్పుడర్థమైంది ఇంద్రుడికి స్వామికి కావలసింది ఆడంబరపూజలు, కపట భక్తీ, హంగులూ, ఆర్భాటాలూ కావని, నిర్మల భక్తి, నిరాడంబర పూజలకే ప్రసన్నుడవుతాడనీ! పాహి పాహి అంటూ హరి చరణ కమలాలను పట్టుకున్నాడు ఇంద్రుడు. •



టూర్‌దర్శన్ 20వ పేజీలో

• మన దిగ్గజాలు



కున్వర్ సచ్‌దేవ్

# ఇన్వర్టర్ మ్యాన్ ఆఫ్ ఇండియా

**సేల్స్‌మన్ ఉద్యోగం నుంచి... సు–కమ్ పవర్ సిస్టమ్స్ యం.డీ వరకు... 'ఇన్వర్టర్ మ్యాన్ ఆఫ్ ఇండియా'గా పేరు తెచ్చుకున్న కున్వర్ సచ్‌దేవ్ చేసిన ప్రయాణంలో ఎన్నో ఉత్తేజిత ఘట్టాలు ఉన్నాయి...**

ఢిల్లీలో ఒక మధ్యతరగతి కుటుంబంలో జన్మించారు కున్వర్ సచ్‌దేవ్. చదువు మీద పెద్దగా ఆసక్తి లేదు. ఏదో ఒకరోజు తాను పెద్ద వ్యాపారవేత్తను అవుతానని కలలు కనేవాడు. అలా అని ఆ కలల ప్రపంచంలోనే ఉండిపోలేదు. ఒక్కొక్క అడుగు వేస్తూ తన ప్రయాణాన్ని మొదలు పెట్టాడు.

చిన్నప్పుడు అన్నతో పాటు స్టేషనరి షాపులో పెన్నులు అమ్మాడు. కాలేజీ రోజుల్లో ఈవెంట్స్, ప్రోగ్రామ్స్ నిర్వహించేవాడు. ఢిల్లీ యూనివర్శిటీలో లా చదివిన సచ్‌దేవ్ ఒక కేబుల్ కమ్యూనికేషన్ కంపెనీ సేల్స్ విభాగంలో పనిచేశారు. కొద్దికాలం తరువాత ఉద్యోగం మానేసి ఢిల్లీలో సొంతంగా కేబుల్ టీవీ ఎక్విప్‌మెంట్ తయారీ వ్యాపారంలోకి దిగారు. 'సు–కమ్' పవర్ సిస్టం పేరుతో డైరెక్షనల్ కప్లర్స్, మాడ్యులేటర్స్, కేబుల్ ఎక్విప్‌మెంట్ తయారీ ప్రారంభించారు. కొన్ని విజయాల కోసం దారి వెదుక్కుంటూ వెళ్లాలి. కొన్ని విజయాలు అదృష్టం కొద్దీ మన దారి దగ్గరికే వస్తాయి. 'ఇన్వర్టర్ దిగ్గజం' కున్వర్ సచ్‌దేవ్ 'ఇన్వర్టర్ వ్యాపారం'లోకి రావడం అనుకోకుండా జరిగింది. సచ్‌దేవ్ ఇంట్లోని ఇన్వర్టర్ తరచుగా బ్రేక్ డౌన్ అవుతూ ఉండేది. ఇన్వర్టర్ ఉన్న మాటేగానీ ఎప్పుడూ సమస్యే. ఒకసారి ఇంట్లోని ఇన్వర్టర్‌కు సమస్య వచ్చినప్పుడు బయటి నుంచి ఎలక్ట్రిషియన్‌ను పిలిపించడం కాకుండా తానే స్వయంగా రంగంలోకి దిగారు సచ్‌దేవ్.

తన పరిశీలనలో తెలిసింది ఏమిటంటే నాణ్యత లేని పీసీబి బోర్డ్‌లు ఉపయోగిస్తున్నారని. మార్కెట్‌లో ఎటు చూసినా నాణ్యత లేని ఇన్వర్టర్లు కుప్పలు తెప్పలుగా కనిపిస్తున్నాయి. ఆ సమయంలోనే సచ్‌దేవ్‌కు ఒక ఆలోచన వచ్చింది.

'విశ్వసనీయమైన ఒక ఇన్వర్టర్‌కు రూపకల్పన చేస్తే ఎలా ఉంటుంది?'

'విశ్వసనీయతే విజయానికి తిరుగులేని సూత్రం' అనే విషయం పుస్తకాలు బాగా చదివే సచ్‌దేవ్‌కు తెలుసు.

టెక్నికల్ బ్యాక్‌గ్రౌండ్ లేని వ్యక్తి సరికొత్త ఇన్వర్టర్ రూపకల్పన గురించి ఆలోచించడం పెద్ద సాహసమే అని చెప్పాలి. అయితే..ఆ సమయంలో ప్రతికూలతలు, పరిమితుల గురించి ఆలోచించ లేదు సచ్‌దేవ్. ఎన్నో దేశాల ఇన్వర్టర్ల గురించి ఆరా తీశారు. తన సిబ్బందితో కొన్ని ప్రయోగాలు చేయించారు. అడ్వాన్స్‌డ్ టెక్నాలజీతో 'నాణ్యమైన ఇన్వర్టర్'కు రూపకల్పన చేయించి 'సు–కమ్' పవర్ పేరుతో ఇన్వర్టర్ వ్యాపారంలోకి అడుగుపెట్టారు. అనతి కాలంలోనే సు–కమ్ ఇన్వర్టర్ అమ్మకాలు ఊపందుకున్నాయి. మార్కెట్ స్ట్రాటెజీతో మరింత దూసుకు వెళ్లింది సు–కమ్.



కథ 24వ పేజీలో

ప్రపంచంలోనే ప్లాస్టిక్ బాడీ ఇన్వర్టర్లు తయారుచేసిన కంపెనీగా 'సు–కమ్' తన ప్రత్యేకత చాటుకుంది. చిన్న స్థాయిలో ప్రారంభమైన సు–కమ్...కొద్ది సంవత్సరాల్లోనే 'పవర్ సొల్యూషన్స్ ప్రొవైడర్'గా తన సత్తాను చాటి 70 దేశాలకు విస్తరించింది. ఒకప్పుడు పదివేల రూపాయలతో మొదలైన కున్వర్ సచ్‌దేవ్ వ్యాపారం ఇప్పుడు వేయి కోట్ల టర్నోవర్ దాటింది. ఇప్పుడు సు–కమ్ మేజర్ ప్రాడక్ట్స్... హోమ్ ఇన్వర్టర్స్, హోమ్ యుపిఎస్, బ్యాటరీస్, బ్యాటరీ ఛార్జర్స్, బ్యాటరీ ఈక్వలైజర్స్...వీటితో పాటు సోలర్ ఛార్జ్ కంట్రోలర్, సోలార్ గ్రిడ్–టై ఇన్వర్టర్స్... మొదలైనవి.

''మీకు టెక్నాలజీ బ్యాక్‌గ్రౌండ్ లేకపోయినా...ఈ విజయాలు ఎలా సాధ్యమయ్యాయి'' అనే ప్రశ్నకు సచ్‌దేవ్ ఇలా ఆసక్తికరమైన సమాధానం ఇస్తారు...

''టెక్నాలజీ బ్యాక్‌గ్రౌండ్ లేకపోవడం వల్ల హద్దులు తెలియవు. మూస సూత్రాలు తెలియవు. ఇలాంటి సమయంలో ఇమాజినేషన్‌ను నమ్ముకుంటాం. అది క్రియేటివిటీగా మారుతుంది. కొత్త ఆవిష్కరణలకు దారితీస్తుంది. చెప్పొచ్చేదేమిటంటే... టెక్నికల్ బ్యాక్ గ్రౌండ్ లేకపోవడం వల్ల... ఇలా మాత్రమే వెళ్లాలి, అలా మాత్రమే వెళ్లాలి అనే ఆలోచన రాదు. మనలోని సృజనాత్మకత ప్రకారం వెళతాం. కొన్నిసార్లు అది చెడ్డ ఫలితాలు ఇవ్వవచ్చు. కొన్నిసార్లు మంచి ఫలితాలు ఇవ్వవచ్చు. నాకు రెండో ఫలితం అందింది. మనం ఏ రంగం ఎంచుకున్నాం, ఎంత అవగాహన ఉంది అనేది ముఖ్యం కాదు. ఆ రంగంపై మనకు ఎంత ఆసక్తి ఉంది, ఏ మేరకు అధ్యయనం చేస్తున్నాం. ఎంత కష్టపడుతున్నాం అనేది ముఖ్యం''

కున్వర్ సచ్‌దేవ్ అనుభవాలు... నేటి యువతకు గెలుపు పాఠాలుగా ఉపయోగపడతాయనడంలో ఎలాంటి సందేహం లేదు.

● పాటతత్వం



సాయినాథ్ తోటపల్లి
కథ, మాటల రచయిత

# దారి నేను తీరం తాను...



రెండక్షరాల కావ్యం ప్రేమ... రెండు హృదయాల స్పందన ప్రేమ

రెండు కళ్ల నిశ్శబ్ద సంభాషణ ప్రేమ... రెండు మనసుల గానం ప్రేమ.

అనంత శ్రీరామ్ తెలుగు ప్రేక్షక హృదయాలలో చెరగని ముద్ర వేశారు.

డైరెక్టర్ గౌతమ్‌మీనన్ నాగచైతన్య హీరోగా 'సాహసమే శ్వాసగా సాగిపో' చిత్రం కోసం ఒక ప్రేమ గీతం అనంత శ్రీరామ్‌ని రాయమన్నారు. ఎఆర్ రెహమాన్ మ్యూజిక్ చేశారు. ఈ పాటను తమిళంలో భారతియార్ రచించారు. ఆయన భాష చాలా ఉన్నతంగా ఉంటుంది. అంత ఉన్నతమైన భాష, అంత ఉత్తమమైన భావంతో రాస్తే బాగుంటుందని అనంత శ్రీరామ్‌తో అన్నారు దర్శకులు. వెంటనే ఆయన 'తాను నేను' అనే మకుటాన్ని తీసుకుని పాట ప్రారంభించారు. లవ్‌సాంగ్స్ రాయాలంటే మనసు గురించి, ప్రేమ గురించి అద్భుతంగా తెలిసుండాలి. 'యవ్వనంలో ఉన్న కుర్రాడికి జీవితంలో తాను ఇంతవరకు పొందని అనుభూతి, అపూర్వమైన, అద్భుతమైన ఒక భావం పొందబోతున్నానని ముందుగానే తెలుస్తుంటే ఆ భావమే ప్రేమ' అన్నారు ఇంగ్లీషులో. మరికొంత వివరంగా చెప్పాలంటే ప్రేమలో పడ్డవారికి అన్నీ రివర్సే. కళ్లు మాట్లాడతాయి, పెదాలు వెతుకుతుంటాయి, మనసు స్పందిస్తుంది, ఆలోచిస్తుంది, కాని మెదడు మాత్రం నిశ్చేతనంగా ఉండిపోతుంది. అదే సైన్ ఆఫ్ లవ్, ప్రేమ ప్రారంభమైందని అర్థం. అంత లోతుగా 'సాహసమే శ్వాసగా సాగిపో' చిత్రానికి 'తాను నేను..' అంటూ రాశారు అనంతశ్రీరామ్. ఈ పాటలో అద్భుతమైన కవిత్వం ఉంది. ఆ పాట నాకు గొప్పగా నచ్చింది. ఎత్తుగడే **తాను నేను మొయిలు మిన్ను** అన్నాడు. మొయిలు అంటే మేఘం. మేఘానికి వికృతి అది. అంటే ఆకాశంలాంటి నేను, నాలో చెలరేగే ఊహాతీతమైన తీపి భావ సంఘర్షణ ప్రేమ మేఘంలా నాలో పరచుకుంది. నిజంగా ఎంత ఆకాశానికైనా మేఘమే అందం. ఆ వెండి మబ్బులో ఉన్న అందమే అది. ఎలాంటివారి హృదయానికైనా అది అందమే. అలా ప్రారంభించి వెంటనే కిందకు దిగిపోయాడు. నేను అతి చిన్న కొలనుని. ఆ బుజ్జి కొలనులో విరబూసిన కలువ తాను. అందుకని కలువ కొలను అన్నాడు.

తరవాత ప్రేమను పైరు చేను అన్నాడు. అంటే భూమి. తాను ఒక చేను అంతే. దానిలో పచ్చగా పల్లవించిన ప్రేమ తాను. అంటే పైరులాంటిది అన్నాడు. అద్భుతం.

ఆ తరవాత నేను మామూలు చెట్టుని కాని అందులో పచ్చగా పల్లవించిన ప్రేమ తాను. అంటే పైరులాంటిది అన్నాడు. ఆ తరవాత– నేను మామూలు చెట్టునే. చెట్టును నిలబెట్టే వేరు తాను. శశి తానైతే నిశి తాను అన్నాడు. అంటే ఎంత రాత్రికైనా అద్భుతమైనది వెన్నెల. ఆ వెన్నెలను ఇచ్చేది చంద్రుడు. చంద్రుడు తానైతే, నేను రాత్రిని అన్నాడు.

మామూలు మొక్కను నేను, నాలో విరబూసిన కుసుమం తాను అన్నాడు. అంతటితో ఆగలేదు. మామూలు కాగడాను నేను అందులో నుంచి వచ్చే వెలుగు దివ్వె తాను అన్నాడు. అంటే వెలుగు తాను అన్నాడు. తాను తెలుగుభాష అయితే అందులోని తీయదనం తాను. తెలుగు భాషయితే అందులో నుంచి పుట్టిన తియ్యదనం తాను. దారి నేను, దూరం తాను అన్నాడు,

వేరైపోనీ పుడమి మన్ను అన్నాడు. మట్టిని భూమిని విడదీయలేం. పుడమి మన్ను వేరైపోయినా మా ప్రేమ ఆగదు... అంటూ గొప్పగా ముందుకెళ్లాడు.

ఈ పాటను అద్భుతం చేసిన తీరు ముఖ్యంగా ఆ భాష, భావం... ఈ రెండింటిలో హిమాలయాల్లో ఉన్నంత ఔన్నత్యం ఉంది. హిందూ మహాసముద్రంలో ఉన్నంత లోతు ఉంది. దూకే జలపాతంలో ఉండే భావావేశం ఉంది. విస్ఫోటనమవుతున్న అగ్ని పర్వతంలా ఉంది భావావేశం. ఉద్రేకం, యవ్వనంలో ఉండే అనుభూతి ఉంది. పంచభూతాల సాక్షిగా రాసుకున్న పాటలా ఉంది ఈ పాట.

**- సంభాషణ: డా. వైజయంతి**




తాను నేను మొయిలు మిన్ను
తాను నేను కలువ కొలను
తాను నేను పైరు చేను
తాను నేను వేరు మాను
శశి తానైతే నిశినే నేను
కుసుమం తావి తాను నేను
వెలుగు దివ్వె తెలుగు తీపి
తాను నేను మనసు మేను
దారి నేను తీరం తాను
దారం నేను హారం తాను
దాహం నేను నీరం తాను
కావ్యం నేను సారం తాను
నేను తాను రెప్ప కన్ను
వేరై పోనీ పుడమి మన్ను
తాను నేను మొయిలుమిన్ను
తాను నేను కలువ కొలను
తాను నేను గానం గమకం
తాను నేను ప్రాయం తమకం
తాను నేను మొయిలు మిన్ను
తాను నేను కలువ కొలను
తాను నేను పైరు చేను
తాను నేను వేరు మాను
శశితానైతే నిశినే నేను
కుసుమం తావి తాను నేను
వెలుగుదివ్వె తెలుగు తీపి
తాను నేను మనసు మేను

● కొత్తకొత్తగా



ధర:
75 డాలర్లు
(రూ.5,100)

# ఆమ్లెట్ కుక్కర్

ఒక్కసారే మూడునాలుగు గుడ్లను ఉడికించడం, ఆమ్లెట్స్‌లా వేయడం వంటచేసేవారికి కాస్తంత ఇబ్బందే. అయితే ఇకపై ఆ ఇబ్బంది మీకు ఉండదు. ఈ పక్క ఫొటోని చూస్తే మీకే అర్థమవుతుంది. ఇడ్లీ రేకుల్లా కనిపిస్తున్న ఈ కుక్కర్‌లోని రేకులు... ఒకేసారి నాలుగు గుడ్లను ఉడికించి మీ పనిని సులభం చేస్తాయి. ఈ రేకులకు పాన్ కప్పులు ఏర్పాటు చేశారు. ఇందులో గుడ్డును పగలకొట్టుకుని ఉడికించుకోవచ్చు. లేదా, కావాల్సిన రెసిపీని కలుపుకుని ఆమ్లెట్‌లుగా వేసుకోవచ్చు. పగలగొట్టిన ఎగ్ ఉడికినప్పుడు కప్పులకు అంటుకోకుండా ఉండేందుకు ముందుగానే వాటికి ఆయిల్‌ని పూతగా పూయాలి. ఉడికిన తర్వాత పైకి తీసుకునేందుకు వీలుగా ఈ కప్పులను డిజైన్ చేశారు.



# స్వచ్ఛతకు కేరాఫ్..

ఇప్పుడు ప్రతీ ఇంట్లోనూ వాటర్ ప్యూరిఫై మిషన్స్ తప్పని సరైపోయాయి. దీంతో రకరకాల ప్యూరిఫైయింగ్ మిషన్లు మార్కెట్లోకి దూసుకొస్తున్నాయి. అయితే అవి ఎంతవరకు మంచివనే క్లారిటీ ఉండటంలేదు. ఈ ఫిల్టర్‌తో అలాంటి సమస్యలేమీ ఉండవు. ఎన్ఎస్ఎఫ్ ముద్రపొందిన ఈ మిషన్ వాటర్ శుద్ధి చేయడానికి అత్యాధునిక పరికరాలతో రూపొందించడంతో పాటు వినియోగదారులకు అనుకూలమైన ధరలోనే లభిస్తుంది. ఒకవేళ ఇందులోని ప్యూరిఫై ట్యూబ్ రిపేర్‌కు వస్తే రీప్లేస్ చేసుకునే అవకాశం కూడా ఉంది. ఇందులోని హార్డ్‌వేరు ఏదైనా కారణం చేత పనిచేయకుండా పోయినా... సర్వీస్ సెంటర్స్ ఉండవేమో అనే దిగులు అవసరం లేదు. ఏ సర్వీస్ సెంటర్‌లోనైనా రిపేర్ చేయించుకునే విధంగా దీన్ని రూపొందించారు.

ధర:
74 డాలర్లు
(రూ.5,032)



# కాఫీ కావాలా బుజ్జీ..?

ఇదో 'కాఫీ మిషన్'. ''అబ్బో.. ఇలాంటి కాఫీ మిషన్లు చాలానే చూశాం'' అనుకుంటే తప్పులో కాలేసినట్లే. ఈ మిషన్‌లో ఉన్న ఆప్షన్స్‌తో ఆర్డర్ ఇస్తే చాలు మనకు కావాల్సిన విధంగా కాఫీ చేసిపెట్టడమే కాదు, దాన్నదే క్లీన్ చేసుకుంటుంది. కాఫీ పెట్టిచ్చాక... మిషన్‌ని ఆఫ్ చేయాల్సిన పని కూడా ఉండదు. దానికదే ఆటోమేటిక్‌గా ఆఫ్ చేసుకుంటుంది. స్వచ్ఛమైన స్టీల్‌తో తయారైన ఈ కాఫీ మేకర్‌లో కాఫీ చాలా సేపు వరకూ వేడిగా కూడా ఉంటుంది. అంతేకాదు.. మనకు 'ఎలా కావాలంటే అలా' కాఫీని మరింత రుచిగా, మరింత స్ట్రాంగ్‌గా చేసుకోవచ్చు. ఈ మిషన్‌లో కాఫీ తయారు చేసుకోవడానికి, అది ఎక్కువ సేపు వేడిగా ఉంచడానికి, మిషన్ క్లీన్ చేసుకోవడానికి ప్రత్యేకమైన ఆప్షన్ బటన్స్ ఉంటాయి.

ధర:
72 డాలర్లు
(రూ.4896)

● కిసుక్కు



సుబ్బారావు: కళ్ల చెకప్‌కు వెళ్లావట ఎందుకు?
అప్పారావు: నీ కళ్లు నెత్తి కెక్కాయి అంది మా ఆవిడ...

– పి.రవి, వేములవాడ

● మీకు తెలుసా



నార్వేలో ఒక నగరం పేరు 'హెల్' ఆ పేరు ఎందుకు వచ్చిందో తెలియదుగానీ...ప్రతి చలికాలంలో భరించ లేని చలితో 'హెల్' నగరం నిజంగానే నరకాన్ని గుర్తు తెస్తుంది.





## అరటిపువ్వు వడలు

**కావలసినవి:** అరటి పువ్వు – 1 కప్పు, శనగపప్పు– 1 కప్పు, కందిపప్పు– గుప్పెడు, ఎండు మిర్చి– మూడు లేదా నాలుగు, జీలకర్ర– ఒక టేబుల్ స్పూన్, అల్లం– చిన్న ముక్క, ఉల్లిపాయ–1 (సన్నగా తరిగిన ముక్కలు), కరివేపాకు – ఒక రెమ్మ, ఉప్పు– తగినంత, నూనె– డీ ఫ్రై చేసుకోవడానికి సరిపడేంత)

**తయారీ:** ముందుగా శనగపప్పు, కందిపప్పు, ఎండు మిర్చిలను ఓ గంట పాటూ నీళ్లల్లో నానబెట్టాలి. తరువాత అరటి పువ్వులో ఉండే నల్లటి కాడ (వాడుకలో దొంగ)ను తొలగించుకుని పక్కన పెట్టుకోవాలి. గంటపాటు నానబెట్టిన పప్పులు, ఎండు మిర్చిలకు... అరటి పువ్వులు, కరివేపాకు, అల్లం, జీలకర్ర, చిన్నగా తరిగిన ఉల్లి ముక్కలను జోడించి... మిక్స్ (మరీ మెత్తగా కాకుండా) చేసుకోవాలి. ఈ మిశ్రమాన్ని చిన్న సైజ్ వడలుగా చేసుకుని నూనెలో వేయించుకోవాలి.



## శాండ్‌విచ్ దోసె

**కావలసినవి:** దోసెపిండి – తగినంత, బ్రెడ్– 4 ముక్కలు టొమాటో– 1, ఉల్లిగడ్డ– 1, కీరదోసకాయ– 1, నిమ్మ రసం – 1 టీస్పూను, కారం – తగినంత, ఉప్పు – తగినంత

**తయారీ:** బ్రెడ్ ఫ్రై చేసి ఉప్పు, కారం చల్లుకుని పక్కన పెట్టుకోవాలి. పెనం వేడిచేసి దోసె వేసుకోవాలి. ఉల్లిగడ్డ, కీరదోస, టొమాటో ముక్కలు కోసుకోవాలి. ఈ ముక్కలని బ్రెడ్ మధ్యన పెట్టిమరో బ్రెడ్‌ని పైన పెట్టి రెండు ముక్కలుగా కోసుకోవాలి. దోసెని కూడా నాలుగు వైపులా సమానంగా కట్‌చేసి శాండ్ విచ్‌మీద పెట్టుకుని పైన చీజ్ తురుము వేసుకోవాలి. ఈ దోసెని గ్రీన్ చట్నీ, రెడ్ చట్నీతో కలిపి తీసుకుంటే బాగుంటుంది.

## చికెన్ సాటె

**కావలసినవి**

చికెన్ బ్రెస్ట్: 2 ముక్కలు
లెమన్ గ్రాస్: 1 టీ స్పూన్
కొత్తిమీర తరుగు: 2 టీ స్పూన్లు
పచ్చిమిరప తరుగు: 1 టీ స్పూన్
చింతపండు గుజ్జు: 1 టీస్పూన్
ధనియాల పొడి: అర టీ స్పూన్
కారం: అర టీ స్పూన్
నువ్వుల నూనె: అర టీ స్పూన్
రిఫైండ్ ఆయిల్: 1 టీ స్పూన్
కొబ్బరిపాలు: తగినంత

**తయారీ**

చికెన్ ముక్కలకు పైవన్నీ కలిపి ఒక గంట సేపు పక్కనుంచుకోవాలి. తరువాత చికెన్ ముక్కలని రెండు అంగుళాల పొడవుగా కోసుకోవాలి. వీటిని పుల్లలకి గుచ్చి గ్రిల్ చేసుకోవాలి. గ్రిల్ అందుబాటులో లేకపోతే బొగ్గులపై తందూరి చేసుకోవచ్చు. వీటిని పీనట్‌సాస్‌తో కలిపి తీసుకుంటే రుచిగా ఉంటాయి.







• టూర్‌దర్శన్ - తిరువారూరు

# తిరువారూరు, తిరుక్కొట్టియూరు త్యాగరాజసం

భగవంతుడికే కాదు, భగవద్భక్తులను కూడా భగవంతుడితో సమానంగా పూజించడం, వారిని తమ గుండెల్లోనే కాదు, గుడిలో విగ్రహాలు కట్టి ఆరాధించడం అరుదైనదేమీ కాదు. అందుకు నిదర్శనమే త్యాగరాజాలయాలు. నిధి సుఖమా... రాముని సన్నిధి చాల సుఖమా అంటూ అనర్ఘరత్నాల్లాంటి కీర్తనలను అందించిన వాగ్గేయకారుడు త్యాగరాజస్వామికి తమిళనాట రెండు పెద్ద ఆలయాలున్నాయి. అందులో ఒకటి తిరువారూరు. అయితే రెండవది చెన్నై సెంట్రల్‌కు సమీపంలోని తిరువొత్రియూర్‌లో ఉంది. ఈ రెండిటికీ మధ్య చాలా దూరం ఉన్నప్పటికీ, భక్తులు, సందర్శకులు వ్యయప్రయాసలకోర్చి మరీ రెండు ఆలయాలనూ సందర్శించడానికి ఉవ్విళ్లూరతారు. ఎందుకంటే తిరువొట్టియూర్ నుంచి తిరువారూరు మధ్యదారిలో అనేకమైన సందర్శనీయ స్థలాలున్నాయి కాబట్టి ఆనందానుభూతులే తప్ప మార్గాయాసం గుర్తురాదెవ్వరికీ!.



వడి ఉడై అమ్మన్ (పార్వతీదేవి)

దక్షిణ భారతదేశంలోనే అతిపెద్ద ఆలయంగా పేర్కొనే త్యాగరాజస్వామి గుడి తమిళనాడు రాష్ట్రం, తంజావూరు జిల్లాలోని తిరువారూరులో ఉంది. ఈ గుడికి నాలుగువైపులా నాలుగు ఎత్తైన రాజ గోపురాలున్నాయి. 30 ఎకరాల సువిశాలమైన విస్తీర్ణంలో ఉన్న ఈ ఆలయానికి అనుసంధానంగా పెద్ద కోనేరు ఉంది. కమలాలయం అనే పేరుగల ఈ కోనేరు ఆలయంకన్నా పెద్దగా ఉండటం విశేషం. దక్షిణ భారతదేశంలో ఇదే అతి పెద్ద కోనేరు. చోళరాజుల కాలం నాటి ఈ గుడి శిల్పసౌందర్యానికి పెట్టింది పేరు. మూడు ప్రాకారాలతో, అనేకమైన మండపాలతో, అడుగడుగునా అరుదైన సన్నిధులతో అతి సుందరంగా నిర్మితమైనది ఈ ఆలయం. గర్భాలయంలో అత్యంత విలువైన దివ్యాభరణాలతో అలంకృతమై, ఒడలెల్లా పుష్పమాలికలతో నిండిపోయిన త్యాగరాజ స్వామివారి విగ్రహం కనువిందు చేస్తుంది. ఆ పక్కనే వెలలేని మరకత పచ్చని లింగంగా మలచిన విధి విడంగ పెరుమణ్ స్వామి వింతకాంతులతో వెలిగిపోతూ భక్తులను పచ్చగా పలకరిస్తుంటాడు. అంతేకాదు, ఆలయంలో అనేకమైన తైలవర్ణ చిత్రాలున్నాయి. వాటిలో శయనముద్రలో ఉన్న శ్రీ మహావిష్ణువు... ఆయన ఎదపైన నటరాజస్వామి నర్తిస్తూ ఉన్న చిత్రం చూపు తిప్పుకోనివ్వనంత సుందరంగా ఉంటుంది. ఆలయానికి అతి పెద్ద రథం ఉంది. ఆ రథానికి తగ్గట్టుగా తిరువారూరులో ఏటా బ్రహ్మాండమైన ఉత్సవం జరుగుతుంది. ఈ ఉత్సవానికి ఇరుగు పొరుగు రాష్ట్రాల నుంచి కూడా భక్తులు విచ్చేసి, స్వామివారిని తిలకించి పులకితులవుతుంటారు. నిత్యం పూలమాలలతో కప్పబడి ఉండే త్యాగరాజస్వామివారి పాదాలు ఏడాదికి రెండుసార్లు మాత్రం భక్తులకు దర్శనమిస్తాయి. ఆ రెండూ రెండు ఉత్సవాలే. అవి పంగుని ఉత్తరం, తిరువాత్తిరై. ఈ ఉత్సవాలలో పంగుని ఉత్రంలో త్యాగరాజస్వామి ఎడమపాదాన్ని, తిరువాత్తిరై ఉత్సవంలో కుడిపాదాన్ని భక్తులు దర్శించుకుంటారు. ఆలయంలో ఉన్న సన్నిధులలో అనంతీశ్వరర్, నీలోత్తంబ, అచలేశ్వర స్వామి, అడగేశ్వర స్వామి, వరుణేశ్వరస్వామి, అణ్ణామలైయేశ్వరస్వామి, కమలాంబ ప్రధానమైనవి.

ఉత్సవసమయాలలో స్వామి, అమ్మవార్లు చంద్రశేఖరుడు, చంద్రశేఖరి మూర్తులు ఉత్సవమూర్తులుగా దర్శనమిస్తారు. అంతేకాదు, ఇక్కడ కమలాలయం కోనేరులో జరిగే తెప్పోత్సవం మిక్కిలి ప్రసిద్ధి. ఆలయం ఆవరణలో అనేకమైన పవిత్ర వృక్షాలున్నాయి.



తిరువారూరు శ్రీ త్యాగరాజ స్వామి ఆలయం, కమలాలయం కోనేరు

ఈ వృక్షాలను కూడా దేవతాస్వరూపాలుగా భక్తులు పూజిస్తారు. ప్రదక్షిణలు చేస్తారు. మొక్కులు సమర్పించుకుంటారు.

త్యాగరాజస్వామికి తిరువారూరు ఎంతటి ప్రసిద్ధి చెందినదో తిరువొ్ట్రియూర్‌కి కూడా అంతే ప్రాశస్త్యం. ఇది తిరువారూరుకి సుమారు 375 కిలోమీటర్ల దూరంలో ఉంది. ఇక్కడ విశేషం ఏమిటంటే ఈశ్వరుడే భక్తుడికి కోరుకున్న వారితో పెళ్లి జరిపించడం. భక్తవత్సలుడు, పరమ దయామయుడు అయిన పరమశివుడు తన సేవకుడి మనోరథాన్ని తీర్చడం కోసం అతడు భూలోకంలో జన్మించేలా చేసి, అతను మనసు పడ్డ పార్వతీదేవి ఇద్దరు చెలికత్తెలతో స్వయంగా పెళ్లి చేసిన విచిత్ర ఉదంతం, ఘన చరిత చెన్నపట్నానికి సమీపంలోని తిరువొ్ట్రియూర్ ఆలయానిది. ఆదిదేవుడు కొలువైన ఈ క్షేత్రాన్ని దర్శించుకోవడం మానసిక ప్రశాంతతను, ఆనందాన్ని కలిగిస్తుందనడంలో సందేహం లేదు. అదేమిటో, ఎక్కడో చూద్దాం...

చెన్నైనగర శివారు ప్రాంతమైన తిరువొ్ట్రియూర్‌లో అత్యంత పురాతనమైన ఆలయం ఉంది. అత్యద్భుతమైన శిల్పసౌందర్యంతో, అణువణువునా సొగసైన పనితనం ఉట్టిపడే ఈ ప్రాచీన కట్టడం త్యాగరాజస్వామి ఆలయమైతే, ఈ ఆలయ ప్రాంగణంలోనే పరమశివుడు తన భక్తుడైన సుందరుని కల్యాణాన్ని జరిపించిన వృక్షం నేటికీ భక్తులకు దర్శనమిస్తూ, వారి మనోరథాలను నెరవేరుస్తుంటుంది. స్వామివారి సన్నిధికి కుడివైపునే వడి ఉడై అమ్మన్ ఆలయం ఉంది. ఎడమవైపున జగన్నాథుడు, జగదాంబికల సన్నిధులు నేత్రపర్వం చేస్తుంటాయి. ఆ పక్కనే వినాయకుడు, కుమారస్వామి, బాలపరమేశ్వరుడు, కాళికాంబ సన్నిధులు కనువిందు చేస్తూ, భక్తులకు పరమశివుడి సాన్నిధ్యాన్ని కనులముందు సాక్షాత్కరింపజేస్తుంటాయి. పరమశివుడి అమృతహస్తాల మీదుగా కల్యాణం కావించుకున్న ఆ భక్తుడి పేరు సుందరం. ఆయనే సుందరమూర్తి నాయనార్‌గా ప్రసిద్ధిపొందారు. ఈ దివ్యక్షేత్రంతో పత్తినాథర్ అయ్యర్ అనే యోగిపుంగవునికి కూడా అవినాభావ సంబంధముంది.

### నక్షత్ర లింగ సన్నిధి!

తిరువొ్ట్రియూర్ ఆలయంలోని మరో విశిష్టత ఏమిటంటే, ఇక్కడ నక్షత్రలింగ సన్నిధి అని 27 నక్షత్రాలకు సంబంధించి 27 శివలింగాలున్నాయి. ఈ సన్నిధిలో భక్తులు తమ జాతక దోషాలను పోగొట్టుకునేందుకు పూజలు చేస్తుంటారు. ఉత్సవమూర్తి అయిన త్యాగరాజస్వామి, మూలవిరాట్టు అయిన ఆదిపురీశ్వరుని విగ్రహాలు భక్తులను ఆనంద పారవశ్యంలో ముంచి వేస్తుంటాయి. సువర్ణకవచాన్ని అలంకరించుకుని ఉన్న మూలవిరాట్టు ధగద్ధగాయమానంగా మెరిసిపోతూ, భక్తులకు కొంగుబంగారంగా భాసిల్లుతుంటుంది. ఎక్కడా లేనివిధంగా ఇక్కడి మూలవిరాట్టు ఆదిపురీశ్వరుడు నిత్యం తైలాభిషేకంలో మునిగి తేలుతుంటాడు. ఆయనకు అభిషేకించిన తైలం పిల్లల మాడుమీద అంటి, నొసట బొట్టులా పెడితే... బాలారిష్టాలూ, దృష్టిదోషాలూ అంతరించిపోతాయనీ, బాలలు ఆయురారోగ్యాలతో నిత్యం ఆనందంతో కేరింతలు కొడతారని ప్రతీతి.





తిరువారూరు రథోత్సవం సోమస్కంద తిరునాగేశ్వరం

భక్తులు ప్రత్యేక రుసుము చెల్లించడం ద్వారా ఆలయంలో స్వామికి చందనకాప్పు (గంధపు పూత), మంజళ్ కాప్పు (పసుపు పూత), పంచామృతాభిషేకం, క్షీరాభిషేకాలను స్వయంగా నిర్వహించుకోవచ్చు. దోషనివారణ చేసుకోవచ్చు.

### ఎక్కడ ఉందంటే..?

చెన్నై నగరానికి శివారు ప్రాంతంలోనే ఉంది తిరువొ్ట్రియూర్. చెన్నై సెంట్రల్ రైల్వేస్టేషన్ నుంచి బస్సులు, లోకల్ రైళ్లు ఉన్నాయి. ఆటోలలో కూడా ఆలయానికి చేరుకోవచ్చు. తిరువొ్ట్రియూరులో తెలుగువారు తక్కువేమీ కాదు. అందువల్ల తెలుగు వారికి భాషాపరమైన ఇబ్బంది ఉండదు. బస, భోజన వసతులకు కూడా బాగానే ఉంటాయిక్కడ. స్థానికులు కొందరు కొద్దిపాటి రుసుముతో ప్రయాణికులకు శుచిగా, రుచిగా తమ ఇళ్లలోనే భోజనాలు ఏర్పాటు చేస్తారు.

**తిరువారూర్...** దేశంలోని అన్ని ప్రధాన నగరాలనుంచి తిరువారూరుకు నేరుగా బస్సులు, రైళ్లు ఉన్నాయి. తిరువారూరు రైల్వేస్టేషన్ లేదా బస్‌స్టాండ్ నుంచి పానగల్ స్ట్రీట్‌లో ఉన్న ఆలయానికి చేరుకోవడం సులువే. ఇక్కడ భోజన, వసతి సదుపాయాలకు కొదవే లేదు.

### ఇతర సందర్శనీయ స్థలాలు

తిరువారూరుకు సమీపంలో శ్రీ ముక్తీశ్వరాలయం,ఆలయం, శ్రీ వరదరాజ పెరుమాళ్ ఆలయం, శ్రీలోకనాథ పెరుమాళ్ ఆలయం, శ్రీ పురుషోత్తమ పెరుమాళ్ ఆలయం, ఔగారనాథ్ ఆలయం, శ్రీ మంజునాథేశ్వర ఆలయం, శ్రీకైలాసనాథర్ ఆలయం, శ్రీ తమరైయ్యాళ్ కెల్వన్ ఆలయం, వల్లీశ్వరాలయం, తాళకావేరి ఆలయం ఉన్నాయి. వీటితోపాటు తిరువొ్ట్టియూర్‌కు చేరువలో మెరినాబీచ్, కపాలీశ్వరాలయం, సెయింట్ జార్జ్ ఫోర్ట్, అరిగ్నార్ అణ్ణా జూలాజికల్ పార్క్, శ్రీ ఆపర్థసారథి స్వామి ఆలయం, బీసెంట్ నగర్ బీచ్, వివేకానంద ఐలం, వడపళని మురుగన్ ఆలయం చూపరులను కట్టిపడేస్తాయి.

**- డి.వి.ఆర్. భాస్కర్**



# బ్రెయిడెడ్ క్రౌన్





కురులు విరబూస్తే అందం. అవే కురులను మెలివేస్తే మరింత అందం. నిజానికి మహిళల అందంలో ప్రత్యేక స్థానం కేశాలంకరణదే. మోడల్ యుగంలో విరబూసినా... మెలివేసినా అందమే అనుకోండి. కానీ, మోడల్ జడలు వేసుకోవడంలో మాత్రం కాస్త.. కిటుకులు తెలుసుండాలి. నాలుగైదు రకాల మోడల్స్ వచ్చుండాలి. ఈ ఫొటోలోని మోడల్ చూడండి. సింపుల్‌గానే కాదు.. స్టైల్‌గా కూడా ఉంది కదూ. మరైతే ఇంకెందుకాలస్యం. ట్రై చేయండి.

1. ముందుగా జుట్టును చిక్కులు లేకుండా దువ్వుకోవాలి. తరువాత ఎడమ వైపు ముందు నుంచి మూడు చిన్న చిన్న పాయలను తీసుకోవాలి.
2. ఆ మూడు పాయలను చివరి వరకూ అల్లుకోవాలి.
3. తరువాత ఆ జడను తల వెనుక నుంచి కుడివైపుకు తీసుకుని టైట్‌గా హెయిర్ పిన్ పెట్టుకోవాలి.
4. కుడివైపు కూడా అదే విధంగా మూడు పాయలు తీసుకుని జడలా అల్లుకోవాలి.
5. ఇంతకు ముందు ఎడమ వైపు జడను మెలివేసినట్లుగానే.. కుడివైపు జడను కూడా తల వెనుక భాగం నుంచి చుట్టి ఒకదాని కింద ఒకటి వచ్చేలా చూసుకోవాలి.
6. ఇప్పుడు కుడివైపు నుంచి తీసుకున్న జడకి కూడా టైట్‌గా హెయిర్ పిన్ పెట్టుకోవాలి.
7. పిన్నులు పెట్టిన జడలను కదలకుండా పట్టుకుని.. మనం పెట్టుకున్న పిన్‌లు స్ట్రాంగ్‌గా ఉన్నాయో లేదో సరి చూసుకోవాలి.
8. చివరిగా విరబూసిన జుట్టును నెమ్మదిగా దువ్వుకుంటే చక్కని మోడల్ మీ సొంతమవుతుంది.

# స్లిట్ కుర్తీ

కంఫర్ట్‌లోనూ, స్టైల్‌లోనూ కుర్తీ ది బెస్ట్ ఆప్షన్ నేటి తరానికి. మార్కెట్‌లో ఎన్ని రకాల కుర్తీ మోడల్స్ వచ్చినా మరో కొత్త రకం కుర్తీ కోసం వెతుకులాట ఉంటూనే ఉంటుంది. నవతరం అమ్మాయిలు కోరుకునే స్లిట్ కుర్తీ డ్రాఫ్టింగ్ సులువు. స్టిచింగ్ సులువు. ట్రై చేయండి. స్టైల్‌గా మెరిసిపోండి.

**ఇంచులలో కొలతలు...**

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ఛాతీకొలత | 32 | 34 | 36 | 38 | 40 | 42 |
| ఛాతీ చుట్టుకొలత | 33 | 35 | 36 | 38 | 40 | 42 |
| ఛాతీ కింది కొలత | 26 | 27 | 30 | 32 | 34 | 37 |
| హిప్ | 33 | 34 | 38 | 40 | 42 | 45 |
| భుజం | 11 | 12 | 12 | 13 | 13 | 14 |
| స్లీవ్ లెంగ్త్ 3/4 | 15 | 15 | 15 | 17 | 17 | 17 |
| ఆర్మ్‌హోల్ | 14 | 15 | 15 | 16 | 17 | 17 |
| ఫ్రంట్ నెక్ | 6 | 6.5 | 7 | 7 | 7.5 | 7.5 |
| బ్యాక్ నెక్ | 8 | 8 | 8.5 | 8.5 | 9 | 9 |
| పూర్తి పొడవు | 36 | 38 | 38 | 38 | 40 | 40 |

ఈషా, డిజైనర్



నిర్వహణ: ఎన్.ఆర్

కర్టెసీ: ఇన్‌స్టిట్యూట్ డిజైన్ ఇన్నోవేషన్ (ఐడిఐ), హైదరాబాద్ www.idi.co.in

నోట్:01

మొదటిసారి డిజైన్‌డ్రాఫ్టింగ్‌ని ట్రై చేసేవారు ముందుగా కుర్తీ డిజైన్‌ని చార్ట్ మీద గీసుకోవాలి. తర్వాత ఎంపిక చేసుకున్న క్లాత్‌మీద నమూనాను గీసుకోవచ్చు. ఈ విధంగా కట్ చేసుకుంటే కుట్టడం సులువు అవుతుంది.

నోట్:02

చిత్రంలో రెండు రకాల క్లాత్‌లు తీసుకొని డిజైన్ చేసిన కుర్తీని ఇచ్చాం. ముందుగా రెండు రంగుల క్లాత్‌ని కుట్టి, తర్వాత డ్రాఫ్టింగ్ గీసుకోవాలి. స్లీవ్స్‌కి ఇష్టమైన రంగు క్లాత్‌ని ఎంపిక చేసుకోవచ్చు.

నోట్: 03

H2 - B2 ఫ్రంట్ బాడీ సింగిల్ స్లిట్. B3 లైన్ నుంచి ఓపెన్ స్లిట్ ఉంచాలి. ఆ పైన అంటే H2 - B3 వరకు స్లిట్ చేసినదాన్ని కుట్టు వేయాలి. ఇది మరింత స్టైల్‌గా ఉండటానికి H2 నుంచి 2 అంగుళాలు తీసుకొని, అక్కడ నుంచి మాత్రమే B3 వరకు స్లిట్ తీసుకోవచ్చు. ఈ స్లిట్‌ను కుట్టి, దాని పైన కాంట్రాస్ట్ బటన్స్ కుడితే అందంగా ఉంటుంది.

## ఫ్రంట్ బాడీ డ్రాఫ్టింగ్

- AB = కుర్తీ లెంగ్త్
- AE = ఆర్మ్ హోల్ రౌండ్/2
- AF = వెయిస్ట్ లెంగ్త్
- AG = హిప్ లెంగ్త్
- EE1 = బస్ట్ రౌండ్/4
- FF1 = వెయిస్ట్ రౌండ్/4
- GG1 = హిప్ రౌండ్/4
- A1 నుంచి EE1 లైన్‌కి స్ట్రెయిట్ లైన్ గీయాలి. E2 వద్ద మార్క్ చేయాలి.
- మళ్లీ A1 నుంచి అర అంగుళం కిందుగా మార్క్ చేసి షోల్డర్ స్లోప్ గీయాలి. ఇది A2 గా మార్క్ చేయాలి.
- A2&E2 మధ్య పాయింట్ A4
- A4 నుంచి 1/2 అంగుళం లోపలికి A5 వద్ద మార్క్ చేయాలి.
- A2, A4, E1 & A2, A5, E1 బ్యాక్ బాడీ, ఫ్రంట్ బాడీ ఆర్మ్‌హోల్ కర్వ్ భాగాలు.
- E1, F1, G1 & B1 సైడ్ వంపు భాగం.
- AA1 = భుజం/2
- AA2 = 1/2 అంగుళం షోల్డర్ స్లోప్
- AA3 = నెక్ విడ్త్/2
- A3, A2 స్ట్రెయిట్ లైన్ షోల్డర్ స్లోప్
- A3 AX = నెక్ డెప్త్
- AH = 12 అంగుళాలు
- HH2 = BB2 = 4 అంగుళాలు
- H2 & B2 స్ట్రెయిట్ లైన్ ఫ్రంట్ బాడీ సింగిల్ స్లిట్.
- B2 – B3 = స్లిట్ లెంగ్త్




## బ్యాక్ బాడీ డ్రాఫ్టింగ్

- AB = కుర్తీ లెంగ్త్, ● AE = ఆర్మ్‌హోల్ రౌండ్/2
- AF = వెయిస్ట్ లెంగ్త్, ● AG = హిప్ లెంగ్త్
- EE1 = ఛాతీ చుట్టుకొలత/4
- FF1 = నడుము కొలత /4
- GG1 = హిప్ రౌండ్/4
- A1 నుంచి E E1 E2 వరకు మార్క్ చేయాలి.
- A1 నుంచి అర అంగుళం కిందుగా మార్క్ చేయాలి. అది షోల్డ్‌స్లోప్ A2
- A2&E2 మధ్య సెంటర్ పాయింట్ A4. A2 A4 E1 కర్వ్ లైన్, ● E1, F1, G1 - B1 సైడ్ వంపు భాగం
- AA1 = షోల్డర్/2, ● AA2 = 1/2 అంగుళం షోల్డర్ స్లోప్, ● AA3 = నెక్ విడ్త్/2
- A3, A2 స్ట్రెయిట్ లైన్ షోల్డర్ స్లోప్
- A3AX = నెక్ డెప్త్




## స్లీవ్స్ డ్రాఫ్టింగ్:

- AB = స్లీవ్స్ లెంగ్త్, ● AC = ఆర్మ్‌హోల్ రౌండ్/2,
- C C1 = స్ట్రెయిట్ లైన్ 3 అంగుళాలు,
- A A1 = 1 అంగుళం. ● A1 C1 కి మధ్య పాయింట్ A2,
- A3, A4 = A3 పాయింట్‌కి అటు ఇటు అర అంగుళం మార్క్ చేయాలి. వీటిని కలుపుతూ అంటే A A1 A3 C1 - A A1 A4 C1 ఇలస్ట్రేషన్‌లో చూపిన విధంగా గీయాలి,
- BB1 = స్లీవ్ రౌండ్/2,
- C1 B1కి క్రాస్‌గా స్లీవ్స్ సైడ్ లైన్ గీయాలి.



● కథ

# వలస పక్షులు

● రాచపూటి రమేష్

‘‘ఎల్లుండే గదా అమ్మోరి జోతులు వూర్లో మొదులు. ఈ ఎనిమిదొందలు ఎత్తుకోని పోయి గుర్రంకొండలో అమ్మోరికి మంచి చీర కొనుక్కురండి నువ్వూ, నీ పెళ్లాము. తొలిపూజ మనదే గదా’’ కొడుకు సురేంద్ర చేతిలో డబ్బుపెట్టి చెప్పినాడు నారప్ప.

‘‘మింగేదానికి మెతుకులే, మీసాలకు వాసన నూనె రాసినడంట ఎవడో. అట్లా వుంది మీ నాయనా కొడుకుల యవ్వారం’’ అని గొణుక్కుంటూ ఆ డబ్బులను ట్రంకుపెట్టె అడుగున దాచింది సరోజ.

సరోజ ఏదో గొణుక్కుంటూ మధ్యాన్నం సంగటి, శనక్కాయల పచ్చడి చేయడానికి వంటింట్లోకి దూరింది. రెండు గదులుండే ఆ పెంకుటింట్లోంచి లయబద్ధంగా మగ్గం చప్పుడు వినిపిస్తోంది, రెండు మగ్గాల్లోంచి.

●●●

చిత్తూరు జిల్లా కలకడ దగ్గరుండే కోన గ్రామంలో వందకు పైగా చేనేత మగ్గాలున్నాయి. వాటిల్లో ఎక్కువగా నూరో నెంబరు లుంగీలు, నూలు చీరలు తయారౌతున్నాయి. గుడియాత్రం నుండి పది రోజులకొకసారి వచ్చే అరవ ఆసాములు లుంగీలకు పడుగు ఇచ్చి, తయారైన లుంగీలను చేనేత పనివాళ్ల నుండి తీసుకొని, వాళ్లకు కూలీలిచ్చి వెళ్లిపోతూ వుంటారు. నూలు చీరలు కొందరు సమీపంలోని మదనపల్లెకు తీసుకెళ్లి అమ్ముకొస్తూ వుంటారు.

నూకల నారప్ప కుటుంబం అనాదిగా ఆ గ్రామంలోనే చేనేత వృత్తిలో జీవనం సాగిస్తూ వుంది. తండ్రి వేసిన పూరి గుడిసెను తొలగించి నారప్ప అదే జాగాలో చిన్న పెంకుటింటిని కట్టించాడు. అతని భార్య లచ్చిందేవి కూడా ఇంట్లో నూలు వడకడం, కండెలు చుట్టడం చేసేది. వారి ఇద్దరి కొడుకుల్లో పెద్దవాడు హరి తిరుమలలో సెక్యూరిటీ గార్డుగా కాంట్రాక్ట్ ఉద్యోగం చేస్తూ భార్యా పిల్లలతో తిరుపతిలో వుంటున్నాడు. సురేంద్ర పదో తరగతితో చదువు చాలించి అనువంశిక వృత్తియైన చేనేత పనిలో దిగాడు. కొడుకు ఒక రేకుల షెడ్డు వేయించి, అందులోనే మగ్గం ఏర్పాటు చేసుకున్నాడు. కొంతకాలంగా లచ్చిందేవి ఆస్తమాతో మంచం పడ్తే, ఇంట్లో పనంతా సురేంద్ర భార్య సరోజే చేస్తూ వుంది. లచ్చిందేవి మందులకూ, ఇన్‌హేలర్లకూ చాలా ఖర్చవుతూ వుంది నారప్పకు. అది తలకు మించిన భారమే అతనికి.

ప్రతి ఉగాదికి ఆ గ్రామంలోని చౌడేశ్వరి దేవాలయంలో మూడు రోజులపాటు ఘనంగా చౌడేశ్వరీ జ్యోతులు అనే వుత్సవాలు జరుగుతాయి. అనాదిగా నారప్ప వంశమే అమ్మవారికి తొలిపూజ చేసి చీర, సారె సమర్పించడం జరుగుతూ వుంది. ఉత్సవాల్లో భాగంగా జంతు బలులు, ఆటపాటలు కోలాహలంగా మూడు రోజులూ సాగుతూ వుంటాయి. ఆ జ్యోతులకే నారప్ప కొడుక్కు డబ్బులిచ్చి అమ్మవారికి మంచి చీర కొనుక్కొని రమ్మని చెప్పాడు.

●●●

‘‘ఇద్దో నిన్నే, ఈ వూర్లో వుండి నువ్వెంత బండ చాకిరీ చేసినా అది బూడిదలో పోసిన పన్నీరే. మనకి ఇద్దురూ ఆడపిలకాయలే. రేపు వాళ్ల పెళ్లిళ్లకూ, కట్నాలకూ డబ్బులు జమ చేయాలి గదా! ఈ వూళ్లో వాళ్ల సదువులు అరాకొరగా వుండాయి. మదనపల్లెలో పట్టు మగ్గాలనేసేవోళ్లకు దండిగా అడ్వాన్సులిచ్చి పన్లో పెట్టుకుంటారు గదా. మజూరీలు అక్కడ శానా వుంటాదంట. రమక్క చెప్పింది. నా మాటిని మదనపల్లికి ఎలబారి ఆడ పన్లో చేరు. పిలకాయలనూ కాన్వెంట్లో ఎయ్యొచ్చు. వాళ్ల సదువులకూ బంగారానికీ దుడ్లు ఎగేసి బాంకిలో



ఏసుకోవచ్చు'' భర్త సురేంద్రను పోరసాగింది సరోజ.

''కరెక్టే. కానీ అమ్మా నాయనలను ఒంటిగా వొదిలి...'' నసుగుతూ అన్నాడు సురేంద్ర సందేహంగా.

''నీ మొహం! మీ అమ్మిప్పుడు లేచి బాగా తిరగతా వుండాది గదా. వంట గూడా చేస్తా వుండాది. వారానికొకసారొచ్చి మీ అమ్మ నాయనలను చూసి రావచ్చు'' నిష్ఠూరంగా చెప్పింది సరోజ.

''సరే సరే. మనూరి పిలకాయలు కొందురాడ మగ్గం నేస్తా వుండారు. వాళ్లను పని గురించి అడిగి చూస్తా'' భార్యను సముదాయించాడు సురేంద్ర.

●●●

''సొంతూరినీ, సొంతింటినీ వదిలి ఆ టౌన్లో ఏమవస్థలు పడతావు నాయనా, ఈడనే అమ్మ నాయన్ను సూసుకుంటూ వుండిపోగూడదా'' బీడీ దమ్ములాగి పొగ వదులుతూ అన్నాడు రామయ్య. ఆయన సురేంద్రకు మేనమామ వరస, నారప్ప పక్క ఇంట్లోనే వున్నాడు.

''ఈడుంటే ఎప్పటికీ పైకి రాలేము. పిలకాయలకు కాన్వెంటు చదూలు అవసరం గదా ఈ కాలానికి. మదనపల్లెలో ఇస్కూళ్లు బాగా వుంటాయి. మజూరీలు బాగుంటాయి'' అన్నాడు సురేంద్ర.

నులక మంచం మీదున్న నారప్ప ఇబ్బందిగా కదిలాడు. అతనికి, అతని భార్యకూ కొడుకు పరాయి వూరుకు పోయి పనిలో చేరడం ఎంత మాత్రం ఇష్టం లేదు.

''అది కాదురా, ఈ వూర్లో జ్యోతులకు మనదే తొలిపూజ గదా. వూరు వదిలితే వొంతు తప్పిపోతుందేమో. రేపు నాకేమైనా ఐతే, నువ్వే గదా ఆ పూజ చెయ్యాల'' అన్నాడు నారప్ప, దిగాలుగా.

''పూజదేముండాది! ఆ టైముకొస్తే సరిపోతుంది. అన్నేమైనా ఈ వూర్లోనే పడుండాడా? పిలకాయలను తిరపతి కాన్వెంట్లో చదివిచ్చుకుంటా హాయిగా టౌన్లో వున్నాడు. మొన్న జోతులకూ రాలేదు'' అన్నాడు సురేంద్ర.

''సరే నీ ఇష్టం'' అన్నాడు నారప్ప నిర్వికారంగా.

●●●

సురేంద్ర స్నేహితుడు, అదే వూరివాడైన నాగరాజు రెండేండ్లుగా మదనపల్లెలో మునస్వామి అనే ఆసామి దగ్గర పనిచేస్తా వున్నాడు. మదనపల్లె శివార్లలో వున్న నీరు గట్టువారిపల్లెలో మూడు వేలకు పైగా కార్మికులు పట్టు మగ్గాలు నేస్తూ జీవనం కొనసాగిస్తూ వున్నారు. మునస్వామికి నీరుగట్టు పల్లెలో రెండు మగ్గాల షెడ్లున్నాయి. ఒక్కో షెడ్లో పన్నెండేసి పట్టుమగ్గాలున్నాయి. ఒక్కో పట్టు చీర నేసినందుకు ఎనిమిది వందల మజూరీ! నెలలో పన్నెండు చీరల సాపునేసి సులభంగా పదివేల దాక సంపాదించవచ్చు. ఇంకొంచెం కష్టపడేవాళ్లకు అదనపు ఆదాయం లభిస్తుంది.

నాగరాజు యజమానితో సురేంద్ర పనితనం గురించి చాల పొగిడి, ''పిలకాయలుండేవాడు, లక్ష రూపాయలైనా అడ్వాన్సు ఇప్పించండి. మదనపల్లెలో సంసారం పెట్టుకొని బతకాల'' అన్నాడు.

మునస్వామి నవ్వి, ''మగ్గాల యాపారం ఇప్పుడేడ గిట్టుబాటవుతావుందిరా? రేషం రేట్లు అదిరిపోతా వుండాయి. జరీ, సప్పురీ అన్ని రేట్లు కొండెక్కి కూచోనుండాయి. రంగులద్దేవోళ్లకు, అల్లు పట్టేదానికీ, అచ్చులతికేవోళ్లకు నెలనెలా ఖర్చులౌతా వుండాయి భారీగా. పట్టుచీరల రేట్లు ఏమీ పెరగడం లే. యాభై వేలకు మించి ఈలేను. ఇష్టమైతే చేరమను, లేకపోతే లే'' అన్నాడు కటువుగా.




సురేంద్ర, నాగరాజు ప్రాధేయపడితే, మగ్గాల ఆసామి మునస్వామి బాండు రాయించుకొని సురేంద్రకు అడ్వాన్సిచ్చేదానికి ఒప్పుకున్నాడు.

''ఈ యబ్బి ఈడేంటుంటాడు? మా బిల్డింగ్‌లోనే వుండమను. ఒక రూమెట్లా నెల లాస్టులో కాళీ జేతా వుండాది'' వక్కపొడి నములుతూ చెప్పాడు మునస్వామి.

మునస్వామికి పన్నెండు చిన్న పోర్షన్లుండే ఒక మూడంతస్థుల భవనం ఉంది. ఒక గది, వంట గది వుండే, అగ్గిపెట్టెల్లాంటి పోర్షన్లున్నాయి అందులో. ఆ ఇరుకు ఇళ్లలోనే అతని వద్ద మగ్గాలు నేసే పనివాళ్లు వుంటుంటారు.

పిచ్చుక గూడులాంటి ఆ ఇంటిని చూశాక తాము నలుగురం కష్టం మీద ఆ ఇంట్లో సర్దుకోవచ్చనుకున్నాడు సురేంద్ర. కానీ ఆ ఇంటి బాడుగ నెలకు మూడు వేలని విన్నాక అతని గుండె గుభేలుమంది.

''ఈ టౌన్లో ఇంతకన్నా తక్కువ బాడిక్కి నీకు ఇల్లు దొరికేది కట్టమే. ఇది దొరికిందే లక్కు. నా మాటిని చేరిపో'' అన్నాడు నాగరాజు.

ఆ ఇంటికి ఐదు నెలల అడ్వాన్సు పదహైదు వేలు పట్టుకొని సురేంద్ర పనిలో చేరాక, అతనికి ముప్పై ఐదు వేల అడ్వాన్సు ముట్ట చెప్పాడు మగ్గాల ఆసామి మునస్వామి. మంచి రోజు చూసుకొని భార్య, పిల్లలను పల్లె నుండి తీసుకొని వచ్చి ఆ ఇంట్లో దిగాడు సురేంద్ర.

తండ్రితో కలసి వున్నప్పుడు ఖర్చులు తెలిసి రాలేదు సురేంద్రకు. వేరు కాపురం అంటే అన్ని వస్తువులు కొనాల్సిందే గదా. ఏది లేకపోయినా జరగదు అని అతనికి కొద్దికాలానికే తెలిసొచ్చింది.

గ్యాసు కనెక్షన్‌కు మూడు వేలు, టీవీకి ఐదు వేలు, కుర్చీలు, పాత్రలు, బీరువా, మంచం, పిల్లలకు కాన్వెంట్లో ఫీజులు అన్నీ కలిపి ఇరవై రెండు వేల దాకా టకటకా ఖర్చులైపోయినాయి. మిగిలిన పదమూడు వేలు బ్యాంకిలో అకౌంటు తెరిచి వేసినాడు. కానీ పాలూ, బియ్యము, సరుకులు, కరెంటు బిల్లు, డిష్ బిల్లు, పిల్లలకు పుస్తకాలు, రీచార్జి ఇలా నెల తిరిగేసరికి ఖర్చులు తడిసి మోపెడౌతూ వుంది.

ప్రతి శనివారం షావుకారు ఆ వారం తాలూకు మజూరీ ఇస్తూ వుంటాడు. కానీ ఆ డబ్బు వెంట వెంటనే ఖర్చైపోతూ వుంది. బుధవారానికి చేతిలో ఏమీ మిగలని పరిస్థితి దాపురిస్తూ వుంది.

పల్లెలో ఐతే పాలు, కూరగాయలు, పప్పు ధాన్యాలు అన్నీ తక్కువ రేట్లకు వచ్చేవి. కానీ మదనపల్లె లాంటి పట్టణంలో వాటి రేట్లు అదిరిపోయేలా వున్నాయి.

అన్నిటికన్నా తీవ్రమైన సమస్య నీటి కొరత. మున్సిపాలిటీ కొళాయిల్లో వుప్పు నీళ్లు రోజుకో గంటసేపు వస్తాయి. ఆ నీళ్లు తాగేందుకు పనికి రావు. మున్సిపల్ టాంకరు నాలుగు రోజులకొకసారి వస్తుంది. ఆ టాంకర్లో నీళ్లు పట్టుకోవడానికి స్త్రీ పురుషులు చాంతాడంత క్యూలో నిలబడి, గంటసేపు కాచుకుంటే నాలుగు బిందెలు పట్టుకొనే అవకాశం వస్తుంది. ఆ నీళ్లు పొదుపుగా వాడుకోవాలి. లేకపోతే నీళ్ల కాన్లు కొనుక్కు రావలసి వుంటుంది. తాగేందుకు, స్నానానికీ అన్నిటికీ నీళ్లు రేషనే.

సురేంద్ర పిల్లలిద్దరూ కొత్తగా చేరిన ఇంగ్లిషు మీడియంలో చదువులు అర్థంకాక అవస్థలు పడుతూ వుంటే, వాళ్లకు స్కూల్లోనే ట్యూషను పెట్టించాడు. అందుకు నెలకు మరొక నాలుగు వందలు అదనపు భారం అతనికి నెత్తిన పడింది.

రెండు జకార్డులున్న పట్టు మగ్గం నేయడం చాలా శ్రమతో కూడుకున్న పని. చేతులతో వాటు వేసి వేసి, కాళ్లతో అణగతొక్కి సాయంత్రమయ్యేసరికి సురేంద్ర చేతులు, కాళ్లు విపరీతంగా లాగుతూ వుండేవి.

ఆ శనివారం కూలీ డబ్బులు తీసుకున్నాక సురేంద్ర టీకొట్టు బెంచీపై అలసటగా కూర్చుని వుంటే నవ్వుతూ అతడి దగ్గరకు వచ్చాడు నాగరాజు.

''ఏందినా, అట్లా డల్‌గా కనిపిస్తా వుండావు. ఒంట్లో బాగాలేదా?'' అన్నాడు నాగరాజు.

''ఒకటే కాళ్లు నొప్పి. అదీ కాకుండా, ఈ వారం కర్చులు తలుసుకుంటే గుండె ఢాం

అంటా వుండాది'' అని దిగులుగా చెప్పినాడు సురేంద్ర.

''కాళ్లనొప్పులు టీ తాగితే తగ్గుతాయా? దానికి మందు వేరే వుండాది''అని సురేంద్ర వద్దంటున్నా వినకుండా అతణ్ని బ్రాందీ షాపుకు తీసుకుని పోయాడు నాగరాజు.

''డబ్బులు నేనే ఇస్తా, నువ్వేమీ ఇయ్యద్దులే'' అని బలవంతంగా మందు తాగిపించాడు. తాగాక ఇద్దరూ ముంతాజ్ హోటల్‌కు పోయి బిరియాని తిన్నారు. దాని బిల్లు నాగరాజే ఇచ్చినాడు.

ఒంట్లో మద్యం పడితే కాళ్లనొప్పులు తగ్గి, కొంచెం హుషారుగా అనిపించింది సురేంద్రకు. కానీ అతడినా స్థితిలో చూసి అతడి భార్య ముఖం తిప్పుకుంది.

ఆ తరువాత రెండు, మూడు రోజులకొకసారి నాగరాజు, మిగిలిన సావాసగాళ్లతో కలిసి తాగడం అలవాటు చేసుకున్నాడు సురేంద్ర. దానివల్ల అక్కడా ఇక్కడా అప్పులు చేయాల్సి వచ్చింది. అప్పులు తీర్చడానికి ఆదివారాలు, అమావాస్యల్లో కూడా మగ్గం పని చేస్తూ వున్నాడు. కానీ ఆ అదనపు ఆదాయం కూడా ఏమీ చాలడం లేదు, అతని ఖర్చులు, విలాసాలకి.

సరోజ ఇంటి పని, పిల్లల పనితో అలసిపోయి, సురేంద్ర ఇంటికి చేరేసరికి నిద్రపోతూ వుండేది కొన్నిసార్లు. పైగా భర్త కొత్తగా నేర్చుకున్న తాగుడు అలవాటును అసహ్యించుకుని అతడిని దగ్గరకు రానివ్వడం లేదామె. ఆమె ఎంత చెప్పినా సురేంద్రలో మార్పు రావడం లేదు. పడ్డ కష్టాన్ని మర్చిపోవాలంటే తాగుడొక్కటే మార్గం అని చాలామంది నేతగాళ్లు అనుకున్నట్లే అతనూ అనుకుంటున్నాడు. అతని వూరివాళ్లు ఒకరిద్దరు హితబోధ చెయ్యపోయినా వినిపించుకోలేదు.

ఒకరోజు తాగుతూ మాట్లాడుతున్నప్పుడు భార్య తనను దగ్గరకు రానివ్వని విషయం నాగరాజుతో వాపోయాడు సురేంద్ర. నాగరాజు నవ్వి, ''ఇంట్లో భోజనం దొరక్కపోతే, హోటల్లో భోం చేయమా? నాతో రా'' అని తనతో టౌను శివార్లలో వున్న ఒక ప్రాంతానికి, సురేంద్రను తీసుకొని వెళ్లాడు నాగరాజు. అక్కడ ఓ పాత ఇంట్లో చాలామంది ఆడవాళ్లున్నారు. జిగేల్‌మనే చీర కట్టుకుని పాన్ పరాగ్ పరాగ్గా నములుతున్న ఒక నడి వయసు మహిళ నాగరాజుతో నవ్వుతూ బాగా పరిచయమున్నట్లు మాట్లాడింది. ఇంట్లో దొరకని సుఖం అక్కడ వెతుక్కున్నాడు సురేంద్ర. తరువాత తరచూ అక్కడకు వెళ్లేవాడు. ఇంట్లో దొరకని సుఖం బయట కొనుక్కుంటున్నానని అనుకున్నాడు గానీ ఆ సుఖమే తన ఒళ్లు గుల్ల చేస్తుందని తెలుసుకోలేకపోయాడు సురేంద్ర.

●●●

**ఆ దంపతులిద్దరికీ ఏం చేయాలో తోచడం లేదు. ఒళ్లు పాడై సురేంద్ర కఠినమైన జకార్డు మగ్గం నేత నేయలేకుండా వున్నాడు. వూరికి తిరిగి వెళ్లాలంటే షావుకారు అప్పు, మిగిలిన బాకీలు తీర్చాలి. మందులకు, డాక్టర్లకు విపరీతంగా ఖర్చు అవుతావుంది. ఎట్ల లేదన్నా లక్షా లక్షన్నర చేతిలో పడితే గాని గట్టెక్కలేని గడ్డు పరిస్థితి!**

''నీకసలు బుద్ధుందా? నీకు సిఫిలిస్ సోకింది. ఇట్లానే వదిలేస్తే ఎయిడ్స్ కూడా అంటుకుంటుంది. ఇంట్లో లక్షణమైన భార్యను పెట్టుకొని అడ్డమైన తిరుగుళ్లు తిరగడానికి నీకిదేం మాయరోగం?'' డాక్టరు అడ్డమైన చీవాట్లు పెట్టాడు సురేంద్రను.

సురేంద్ర తలవంచుకుని వింటున్నాడు. అంతకు కొన్ని రోజుల ముందే తరచూ వాంతులౌతూ వుంటే ఇంకొక డాక్టరు దగ్గరకు వెళ్లాడతను. ఆ డాక్టరు కొన్ని టెస్టులు రాసిచ్చి, అవి చేసుకొని రిపోర్ట్స్ తెమ్మన్నారు. తెచ్చాక వాటిని చూసి సురేంద్ర లివర్ బాగా పాడైందని, కొన్ని మందులు రాసిచ్చి, తాగుడు పూర్తిగా మానకపోతే సురేంద్రకు చావు తథ్యమని జోస్యం చెప్పాడు. దాంతో సురేంద్ర బ్రాందీ షాపుకు వెళ్లడం పూర్తిగా మానుకొన్నాడు. ఐనా ఆసరికే అతని ఒళ్లు చాలా పాడైంది.

●●●

హాస్పిటల్ ఖర్చులు, టెస్టులు, మందులకు విపరీతంగా ఖర్చు అవుతూ వుంది. బ్యాంకులో వున్న కొద్దిపాటి బాలెన్సు, సరోజ మిగిల్చిన డబ్బూ ఇట్టే ఖర్చు అయిపోయింది. పిలకాయల స్కూలు ఫీజులు, పుస్తకాలు, ఇంటి బాడుగ అన్నీ కట్టాల్సి వుంది. సురేంద్రకేం చేయాలో పాలుపోలేదు. అప్పుకోసం షావుకారు దగ్గరకు వెళ్లాడు.

''ఇట్టా తాగుడికి, తందనాలకి కర్సులు ఎడాపెడా పెట్టేస్తా వుంటే ఒళ్లే కాదు, ఇల్లు కూడా గుల్ల ఔతాది. ఎవడువాయ్ నిన్ను తాగి తలెత్తుకోమనింది?

నువ్వే కాదు, ఈ మదనపల్లికొచ్చి చేరే మగ్గమోళ్లు శానా మంది ఇట్టానే సెడిపోతా వుండారు. కూలీలెక్కవని ఈడికి ఏడేడ నుండో వచ్చి సేరతా వుండారు. నాలుగు డబ్బులు చేతిలో పడే కొందికి అన్ని అలవాట్లు ఐతాయి. సంసారం సంకనాకి పోతుంది. రేషం రేట్లు సూస్తే కళ్లు తిరగతావుండాయి. జరీ, సప్పురీ, కలర్ ఫాక్రీ, అచ్చులు, పన్నీలు, డోళ్లు అన్నీ కర్సులే. యాపారం అంతంతగానే వుండాది. నీకేమీ ఈలేను. నువ్వు పని నిలిపేయాలనుకుంటే నిలిపేయచ్చు. కానీ నా కాడ తీసుకున్న అడవాన్సు యాభై వేలు నాకిచ్చి పో. వడ్డీ కూడా నిన్ను అడగడం లే'' కఠినంగా చెప్పాడు మునస్వామి. సురేంద్రకు ఏమీ పాలుపోలేదు.

●●●

''మీ అమ్మకి మళ్లీ ఆస్తమా తిరగబెట్టింది. మీ నాయన కూడా గసతోనే మంచం పట్టినాడు. పోయినతూరి మీ నాయన జోతులపుడు తొలిపూజ చేసినాడు. ఈసారి కడవ మాను మోసి తొలిపూజ సేయలేడు. మంచం మీద మడిసి ఏం పూజ చేస్తాడు? నువ్వు మళ్లీ వూరు రావలసిందే'' అన్నాడు రామయ్య మామ. మదనపల్లెలో వున్న కూతురు, ఇంటికి చుట్టపు చూపుగా వచ్చి, సురేంద్రను చూడ్డానికి వచ్చారాయన.

సురేంద్ర ఏమీ మాట్లాడలేదు. సరోజ కూడా మౌనం వహించింది. రామయ్య మామ గుచ్చి గుచ్చి ప్రశ్నిస్తే సురేంద్ర లివర్ పాడై మంచం పట్టిన విషయం చెప్పింది సరోజ.

''సొంతూళ్లో కులం పని చేసుకోకుండా టౌనులో బాగా బతికేయచ్చని వలసలు పోతే ఇట్టనే జరగతాది. నేను మళ్లీ ఒక పెళ్లికి రెండు రోజుల్లో మదనపల్లి రావాల. మీ నాయనతో మాట్లాడి విషయం చెప్తాను'' అన్నాడు రామయ్య మామ ముక్తసరిగా.

ఆ దంపతులిద్దరికీ ఏం చేయాలో తోచడం లేదు. ఒళ్లు పాడై సురేంద్ర కఠినమైన జకార్డు మగ్గం నేత నేయలేకుండా వున్నాడు. వూరికి తిరిగి వెళ్లాలంటే షావుకారు అప్పు, మిగిలిన బాకీలు తీర్చాలి. మందులకు, డాక్టర్లకు విపరీతంగా ఖర్చు అవుతావుంది. ఎట్ల లేదన్నా లక్షా లక్షన్నర చేతిలో పడితే గాని గట్టెక్కలేని గడ్డు పరిస్థితి!

అన్నట్లుగానే రామయ్య మామ మూడు రోజుల్లో మళ్లీ వాళ్లింటికి వచ్చాడు. సరోజ ఆయనకు కాఫీ ఇచ్చి మర్యాద చేసింది.

''మీ నాయనతో మాట్లాడినా. మీ అమ్మకి పసుపు కుంకాల కింద వాళ్ల పెళ్లప్పుడు రెండెకరాలు మీ తాత ఇచ్చినాడంట. ఆ భూమిని మీ మామ సాగు చేస్తా వున్నేడిన్ని దినాలు. మీ వోళ్లకు దాంట్లో నించి ఏమీ ఇచ్చింది లే. ఇప్పుడు మీ మామ పిలకాయలు బాగా సదుకోని మంచి పొజిషన్ల వున్నారంట. ఆ భూమితో వాళ్లకు పన్లే. ఆ మడి అమ్మేసి మీ అప్పులు తీరుస్తామని చెప్పినాడు, మీ నాయన.

నేనిప్పటికి ఒక డెబ్బై వేలు సర్దుబాటు సేస్తా వుండా. నీ అప్పులు తీర్చేసి ఇల్లు ఖాళీ చేసి పల్లెకొచ్చేయి. నీ జబ్బు గురించి మీ అమ్మ దిగులు పడతా వుండాది'' అన్నాడు రెడ్డప్ప.

సురేంద్ర ఆనందంతో ఉబ్బితబ్బిబ్బయ్యాడు. సరోజకి ఒళ్లు తెలీరాలేదు.

వలస పక్షులు ఇంటి దారి పట్టినట్లు, మరో రెండు వారాల్లో వాళ్ల పట్నం కాపురానికి స్వస్తి పలికి, స్వగ్రామం చేరుకున్నారు.

●


డా॥ వేనాటి శోభ
లీలా హాస్పిటల్
మోతీనగర్,
హైదరాబాద్

**● పీరియడ్స్ సమయంలో నొప్పి వస్తుంది. ఈ సమస్య గురించి మా బంధువు ఒకరితో చెబితే... 'చాకొలెట్ సిస్టులు ఉండొచ్చు' అన్నారు. అసలు 'చాకొలెట్ సిస్టులు' అంటే ఏమిటి? అవి ఎందుకు వస్తాయి? మందులతో తగ్గిపోతాయా?**

**- డి.పరమేశ్వరి, దోర్నకల్**

పీరియడ్స్ సమయంలో గర్భాశయంలోని ఎండోమెట్రియమ్ పొర చిన్న చిన్న ముక్కలుగా బ్లీడింగ్ ద్వారా యోని నుంచి బయటకు వచ్చేస్తుంది. కొందరిలో ఎండోమెట్రియమ్ పొర గర్భాశయంలో నుంచి, ఫెలోపియన్ ట్యూబ్స్ ద్వారా పొత్తికడుపులోకి చేరుతుంది. కొందరిలో మెల్లగా అదే కరిగిపోతుంది. కాని కొందరిలో వారి శరీర తత్వాన్ని బట్టి, అనేక రకాల తెలియని కారణాల వల్ల ఎండోమెట్రియమ్ పొర ముక్కలు కరిగిపోకుండా హార్మోన్ల ప్రభావం వల్ల ప్రేరేపితమై, ప్రతి నెలా పీరియడ్స్ సమయంలో పొత్తికడుపులోని ఎండోమెట్రియమ్ పొరలో కూడా కొద్ది కొద్దిగా బ్లీడింగ్ అయ్యి, అక్కడ రక్తం గూడు కట్టడం జరుగుతుంది. దీనినే ఎండోమెట్రియోసిస్ అంటారు. ఈ పొర పొత్తికడుపులో గర్భాశయం వెనుక భాగం పైన, ప్రేగుల పైన, మూత్రాశయం పైన, అండాశయాల పైన... ఇంకా ఇతర భాగాలపైన అతుక్కుని పెరిగే అవకాశాలు ఉన్నాయి. అండాశయం పైన అతుక్కున్న ఎండోమెట్రియల్ పొరలో నెలనెలా బ్లీడింగ్ అయ్యి అందులో రక్తం కొద్దికొద్దిగా చేరి గూడు కడుతూ, రక్తం, చాక్లెట్ రంగులో మారి గడ్డలాగా మారుతుంది. దీనినే చాక్లెట్ సిస్ట్ అంటారు. ఈ సిస్టులు ఒకటి రెండు సెంటీమీటర్లు మొదలుకొని 10 సెంటీమీటర్ల పైన పరిమాణం పెరిగే అవకాశం ఉంటుంది. ఇవి రాకుండా ఉండటానికి ఎటువంటి జాగ్రత్తలు లేవు. అవి ఒక్కొక్కరి శరీర తత్వాన్ని బట్టి, హార్మోన్ల ప్రభావాన్ని బట్టి, గర్భాశయం లోని కొన్ని రకాల లోపాల వల్ల రావచ్చు. వీటి వల్ల పీరియడ్స్ సమయంలో నొప్పి, పరిమాణం బట్టి సంతానం కలగడంలో ఇబ్బంది వంటి ఇతర సమస్యలు ఏర్పడవచ్చు. ఇవి 3 సెం.మీ. కంటే సైజు తక్కువగా ఉన్నప్పుడు కొన్ని రకాల హార్మోన్ల మాత్రలు, ఇంజెక్షన్ల ద్వారా కొందరిలో తగ్గే అవకాశాలు ఉంటాయి. లేకపోతే పరిమాణం పెద్దగా ఉండి, ఇబ్బంది కలిగిస్తూ ఉంటే ఆపరేషన్ ద్వారా తొలగించవలసి ఉంటుంది. కొందరిలో ఆపరేషన్ చేసి తొలగించినా, ఒక్కొక్కరి శరీర తత్వాన్ని బట్టి మరలా చాక్లెట్ సిస్టులు ఏర్పడే అవకాశాలు ఉంటాయి.

**● నేను చాలా సన్నగా ఉంటాను. ప్రెగ్నెంట్‌ని. 'ఇప్పుడు కూడా ఇలా ఉంటే ఎలా? బాగా తినాలి. నీతో పాటు... కడుపులో ఉన్న నీ బిడ్డ కోసం కూడా తినాలి. నువ్వు ఎంత ఎక్కువ తింటే కడుపులో ఉన్న బిడ్డకు అంత ఆరోగ్యం' అని చెబుతున్నారు.**

# చాకొలెట్ సిస్టులు అంటే..?



**నాకేమో పరిమితికి మించి తినే అలవాటు లేదు. ప్రెగ్నెంట్‌గా ఉన్నప్పుడు ఎక్కువ తినాలి అనే దాంట్లో ఎంత వాస్తవం ఉంది? నిజానికి గర్భిణులు ఎలాంటి పోషకాహారం తీసుకోవాలి? చెప్పగలరు.**

**- జి.కవిత, విజయవాడ**

గర్భం దాల్చినంత మాత్రాన, ఎంత ఎక్కువ అంటే అంత తినాలని ఏమీ లేదు. 9 నెలలపాటు గర్భంలో శిశువు ఆరోగ్యంగా పెరగడానికి, మామూలుగా ఉన్నప్పుడు తీసుకునే ఆహారంలో ఎక్కువగా పప్పులు, ఆకుకూరలు, కూరగాయలు, పండ్లు, పాలు, పెరుగుతో కూడిన పౌష్టికాహారం తీసుకోవాలి. అంతేగాని, రెండింతలు తీసుకోవాలని లేదు. మాంసాహారులు అయితే గుడ్లు, మితంగా మాంసాహారం, చేపలు వంటివి తీసుకోవచ్చు. నువ్వు సన్నగా ఉన్నావు కాబట్టి పైన చెప్పిన పౌష్టికాహారంతో పాటు, రోజూ కొద్దిగా డ్రై ఫ్రూట్స్ తినవచ్చు. ఒకేసారి ఎక్కువగా తినడం ఇబ్బంది కాబట్టి, కొద్ది కొద్దిగా ఎక్కువసార్లు అంటే రెండు మూడు గంటలకొకసారి ఆహారం తీసుకుంటూ ఉండవచ్చు. సాధారణ బరువు ఉండి, గర్భవతులైనవారు మామూలు పౌష్టికాహారం తీసుకొని 9 నెలల్లో 8 నుంచి 11 కేజీల వరకు బరువు పెరగవచ్చు. అధిక బరువు ఉన్నవారు 5 నుంచి 8 కేజీలు బరువు పెరిగితే సరిపోతుంది. ఈ సమయంలో అధిక బరువు పెరగడం వల్ల బీపీ, షుగర్, ఆయాసం వంటి సమస్యలు, కాన్పు సమయంలో ఇబ్బందులు వచ్చే అవకాశాలు ఎక్కువగా ఉంటాయి.


ఇంటికి - ఒంటికి
31వ పేజీలో

**● 'గర్భిణులు వాడే మాత్రలతో శిశువులకు ముప్పు' అనే వార్తను ఈమధ్య ఎక్కడో చదివాను. అయితే అందులో... 'గుండెలో మంట సమస్యకు వేసుకునే మాత్రల వల్ల శిశువుకు ఆస్థమా వచ్చే అవకాశం ఉంది' అని ఒకటీ అరా వివరాలు మాత్రమే ఉన్నాయి. మాత్రలంటే ఏ రకమైన మాత్రలు అనే వివరాలు లేవు. గర్భిణిగా ఉన్నవారు జలుబు, తలనొప్పి మాత్రలు... ఇలాంటివి వేసుకుంటే శిశువు మీద ఏమైనా ప్రభావం ఉంటుందా?**

**- బి.స్వప్న, అనంతపురం**

గర్భిణిలకు మొదటి మూడు నెలల సమయంలో శిశువులో దాదాపుగా అన్ని అవయవాలు ఏర్పడతాయి. ఈ సమయంలో కొన్ని రకాల మందులు వాడటం వలన శిశువు మీద ప్రభావం పడి, అవయవాలు సరిగా ఏర్పడకపోవడం వంటి దుష్ప్రభావాలు ఏర్పడవచ్చు. ప్రెగ్నెన్సీలో వాడే మందులు వాటి దుష్ప్రభావాలను బట్టి ఎ, బి, సి, ఎక్స్ అనే కేటగిరీలుగా విభజించబడటం జరిగింది. ఎ, బి కేటగిరీకి చెందిన మందులను ప్రెగ్నెన్సీలో అవసరాన్ని బట్టి వాడుకోవచ్చు. సి కేటగిరీ మందులను, అవి వాడకపోవడం వల్ల వచ్చే దుష్ఫలితం, వాడటం వల్ల వచ్చే రిస్క్ కంటే ఎక్కువగా ఉన్నప్పుడు వాడుకోవచ్చు. ఎక్స్ కేటగిరీ మందులు ఎట్టి పరిస్థితుల్లోను వాడకూడదు. జ్వరానికి, తలనొప్పి వంటి నొప్పులకు పారాసెటమాల్ మాత్ర వాడుకోవచ్చు. జలుబు, దగ్గుకి మిగతా సమస్యలకు డాక్టర్ పర్యవేక్షణలో మందులు వాడుకోవాలి. సొంతగా మందుల షాపులో తీసుకుని వాడరాదు. నొప్పి నివారణ మాత్రలు అంటే డైక్లోఫినాక్, వొవెరాన్ వంటివి గర్భిణీలు వాడటం వల్ల శిశువు, కిడ్నీలు దెబ్బతినటం, ఉమ్మనీరు తగ్గిపోవటం వంటి సమస్యలు ఏర్పడే అవకాశాలు ఎక్కువగా ఉంటాయి. అసిడిటీకి మందులు డాక్టర్ పర్యవేక్షణలో అవసరాన్ని బట్టి వాడుకోవచ్చు. వీటివల్ల శిశువులో సమస్యలు ఏర్పడినట్లు పరిశోధనలలో ఎక్కువగా తెలలేదు.

• సీరియల్ - ఒకటవ అధ్యాయం

## 2

ఆ సోబె (బాణం మొన)కి కళ్లప్పగించారు చాలామంది.

డెబ్బయ్ లేదా ఎనభై బారల అవతల ఎడం చేయి బారజాపి నిలబడి ఉన్నాడు బొంకుల మోదిగాడు. ఆ ఊరివాడే. ఆ చేతిలో వెలక్కాయంత పేడముద్ద, దాని మీద నిలబెట్టిన కోడిగుడ్డు.

ఎక్కువ మందిలో ఉత్కంఠ. ఏం జరుగుతుందో తెలుసులే అన్నట్టు స్థిమితంగా ఉన్నాయి కొన్ని ముఖాలు.

**"సయిలూరి సంతకు– సన్నగాజులు**
**మయిలూరి సంతకు –సన్నపురి చీర.."**

కూనిరాగం తీస్తూనే బాణాన్ని ఆ గుడ్డు మీదకి గురిపెడుతున్నాడు గోకిరి ఎర్రేసు.

గిజిగాడి గూడులాంటి చింపిరి జుట్టు. చెమటతో జిడ్డోడుతున్న ముఖం. ముక్కుకీ చెవులకీ మోటు వెండిపోగులు. మెడలో నల్లతాడుతో తాయెత్తు. కొంచెం తెల్లగా ఉంటాడు కాబట్టి నుదుటి మీద, కణతల మీద ఉన్న కాల్చిన మచ్చలు పట్టిపట్టి చూస్తేగానీ తెలియదు. పొట్ట మీద, భుజాల మీద పచ్చబొట్లు. మొలకి గావంచా. అది గజ్జల వరకే ఉండి, పిరుదులు కూడా కనిపిస్తున్నాయి. తలకు మరో చిన్న గుడ్డ కట్టుకున్నాడు. కుడికాలి మడం దగ్గర రాగి కడియం. కాస్త బొద్దుగా ఉన్నా చలాకీగా ఉంటాడు. సొంతూరు గనర్లపాలెమే అయినా, ఎక్కడ కొండసంత జరుగుతున్నా కనిపిస్తూ ఉంటాడు. ఉదయాన్నే ఆరుగంటల కల్లా బేరసారాలు ఊపందుకునే కొండసంతలకి ఆ ముందు రోజే వచ్చి కావలసిన పనులు చూస్తాడు, మిత్రుడు మోదిగాడితో కలసి. ఇద్దరూ కొండవాళ్లే. తాటాకుతో చిన్న చిన్న పందిళ్లు వేసిపెడతారు. కావడితో నీళ్లు మోస్తారు. దుకాణాలు సర్దే మట్టిదిబ్బలని సరిచేస్తారు. నాలుగైదు అడుగుల పొడవు, రెండు మూడు అడుగుల వెడల్పులతో అరుగుల్లా ఉంటాయి ఆ దిబ్బలు. అడుగు ఎత్తు మాత్రం ఉండే ఆ దిబ్బల మీదే దుకాణాలు సర్దుకుంటారు. షావుకార్లు తలా ఒక అణా, బేడ ఇస్తారు. సరుకులతో రెండెడ్ల బళ్లు తోలుకు వచ్చిన కాపులూ, సరుకు తీసుకువెళ్లడానికి వచ్చిన బళ్ల కాపులూ, మిగిలితే షావుకార్లు ఇచ్చే ముద్దలతో కడుపు నింపేసుకుంటారు ఇద్దరూ.

ఇదంతా ఒక ఎత్తు. ఈ పనయ్యాక కొండ సంతలలో ఎర్రేసు ప్రదర్శించే విలువిద్యా విన్యాసం మరొక ఎత్తు. కృష్ణదేవిపేటలో సంత జరుగుతున్న ఆ చోటుకి వంద గజాల దూరంలో పెద్ద ఖాళీ స్థలం. ఎడ్లనీ, బళ్లనీ కట్టేసే చోటు. ఆ రణగొణ ధ్వని ఏదీ ఎర్రేసుకి వినిపించడం లేదు. ముప్పయ్యో నలభయ్యో ఉంటాయి దుకాణాలు. మన్యంలో దొరకని వస్తువులు అమ్మే దుకాణాలు కొన్ని. కొండవాళ్ల దగ్గర నుంచి అటవీ సంపదను కొనుగోలు చేసే దుకాణాలు ఇంకొన్ని. ఈ సంపదను పట్టుకెళ్లడానికి వచ్చేవాళ్లు కొందరు.

బాగా ఇవతల కట్టేసి ఉన్నాయి ఎద్దులు, విప్పేసిన బళ్లకే. దాదాపు అరవై బళ్లు. వాటిని లాక్కొచ్చిన ఎద్దులు. వాటి మెడలలో ఇత్తడి గంటలూ, మువ్వలూ చేస్తున్న శబ్దం–ఏదీ ఎర్రేసు చెవిని తాకడంలేదు.

పింజిరికె (వింటి నారి మీద ఉంచే బాణం రెండో కొస)ని కుడి చేతి బొటనవేలు, చూపుడువేలు కొసలతో పట్టుకున్నాడు. దానికి ముందే ఉన్న ఈకలతుంటె (బాణం గురి తప్పకుండా ఉపకరించే పక్షి ఈకల అమరిక)ని మధ్య వేలు పదే పదే తాకబోతూ వెనక్కి తగ్గుతోంది. అదో అలవాటు కాబోలు.

అప్పటిదాకా విల్లుని కొంచెం ఎత్తులో పెట్టి బారతీపు (ఆకర్ణాంతం వింటి నారిని లాగడం) భంగిమలో ఉన్న ఎర్రేసు, హఠాత్తుగా విల్లుని కాస్త ముందుకు పెట్టి బొక్కతీపు (నారిని గుండెలదాకా లాగి పట్టుకోవడం) భంగిమకి వచ్చాడు.

చుట్టూ నిలబడి ఉన్న వాళ్ల ముఖాలలో మరింత ఉత్కంఠ. అక్కడ మోదిగాడి ముఖంలో కాస్త కూడా బెదురు లేదు. ఎర్రేసు నైపుణ్యం మీద నమ్మకం.

**"మైలారు సంతకు–వెళుదుమన్నారట...**
**సాయిలూరి సంతకు వెళుదుమన్నారట...**
**మళ్లీవారం సంతకు మనమూ వెళ.........."**

కూనిరాగం ఆగిపోవడం, బాణం విల్లుని వీడడం ఎప్పుడు జరిగిందో, కోడిగుడ్డు భళ్లున పగిలింది.

అద్దిరబన్న అన్నారెవరో గట్టిగా.

"కితం జన్మలో నువ్వు అర్జునుడివై ఉంటావురా!" మెచ్చుకోలుగా అన్నాడు ఓ



బండబ్బాయి, ఒక రాగి పైస తీసి ఎర్రేసు చేతిలో వేస్తూ. దానిని మొలలో చుట్టబెడుతూ అన్నాడు ఎర్రేసు. "ఇదిగో కాపుగారూ! అడివిలో పుట్టినోడెవడైనా అర్జునుడే. ఓ చేతిలో బుల్లి బాణం, ఇంకో చేతిలో బుల్లి విల్లు పట్టుకునే అమ్మ కడుపులో నుంచి బయటకొస్తాం మేం!"

"కోడిగుడ్డు బలేక్కొట్టావ్!" అన్నాడు ఇంకో బండివాడు, మహదానందంగా.

"కోడిగుడ్డేటండి! ఇంకో యాభై బారలు దూరం పెంచుకోండి! అలా ఎండిరూపాయెట్టండి! దాన్ని కూడా కొడతా! రూపాయి మాత్రం నాకిచ్చెయ్యాల!" అన్నాడు ఎర్రేసు, పందెం వేస్తారా అన్నట్టు.

"నా కాడ ఎండిరూపాయెక్కడిది!?" అన్నాడా కాపు.

"పోనీ... మీ సావుకారుని పెట్టమను. యాపారమంతా తూరుపు కుంచం, పడమర కుంచం. బోల్డు సొమ్ము." దొంగతూకాలే అన్నట్టు చేతితో సైగలు చేస్తూ చూపించాడు ఎర్రేసు. మళ్లీ తనే అన్నాడు. "మొన్నవారం గాలికి పందిరి ఊగిందంట. అందుకని నాకిచ్చే బేడ (పన్నెండు పైసలు) కూడా ఎగ్గొట్టాడు. ఇంక రూపాయెక్కడ వదుల్తాడు? సరేగానీ కాపుగారూ! మీ సావుకారిచ్చే బేడ డబ్బులకి బేస్టిన్ దొర కడతన్నాడే, బంగ్లా– అలాంటిది కట్టివ్వాలా ఏంటి?" అన్నాడు పెద్ద గొంతుతో.

ఆ పేరు వినపడగానే గతుక్కుమన్నారంతా. అతడే గూడెం డిప్యూటీ తహసీల్దార్. అల్ఫ్ బాస్టియన్.

"అదే, నర్సీపట్నంలో కడతన్నాడు, ఇన్లేదా! ఇంద్రబవనం కూడా అలాగుండదు. మహానుభావుడు, దాని ఇటక్కోసం మొత్తం అడవంతా కొట్టించేత్తన్నాడు." అన్నాడు మళ్లీ తనే.

"ఒరే... ఊరకోరా! మునసబు లగుడు సత్యనారాయణగార్ని ఇక్కడే చూశాను, ఇంతకు ముందు!" అన్నాడు ఓ బండబ్బాయి రెండు చేతులూ జోడించి, అటూ ఇటూ బెదురుతూ చూస్తూ.

"ఈడు మంచోడో తెలీదు, పిచ్చోడో తెలీదు!" అన్నాడు ఇంకో బండబ్బాయి జారుకుంటూ.

కిసకిస నవ్వుకున్నాడు ఎర్రేసు. నిజమే, ఎర్రేసు అర్థంకాడు. పక్కనే ఉన్న మోదిగాడు కూడా నవ్వుకున్నాడు.

ఐదో ఆరో రాగి పైసలూ, రెండో మూడో అర్ధణాలూ చేతిలో పడ్డాయి. వాటిని నిర్లిప్తంగా చూస్తున్నాడు ఎర్రేసు.

అప్పుడే వచ్చిన ఆదినారాయణ అడిగాడు ."ఎన్ని పైసలు ఎర్రేసు?"

"అడుక్కున్నా ఇన్నే డబ్బులొస్తాయేమో?" అన్నాడు ఎర్రేసు.

"తదాస్తు దేవతలుంటారంట. ఏంటా మాటలు?" అన్నాడు ఆదినారాయణ కంగారుగా.

"విలుకాడికీ, అడుక్కునేవోడికీ ఒకటే ఇలువ అంటన్నా! సరే గానీ, ఎక్కణ్ణుంచి?" అడిగాడు ఎర్రేసు, నవ్వేస్తూ.

## మన్యవీరుడు అల్లూరి గాథ

● డా. గోపరాజు నారాయణరావు

''కొంగసింగి, గురువుగారి దగ్గర నుంచి!'' భుజం మీది మృదంగాన్ని కళ్లతో చూపిస్తూ అన్నాడు ఆదినారాయణ.

ఏదో గుర్తుకు వచ్చినట్టు చటుక్కున అన్నాడు నిష్ఠురంగా ఎఱ్ఱేసు. ''అన్నట్టు.. ఆ ఊసు నాకు చెప్పలేదేం?''

''ఏంటి ఎఱ్ఱేసు? ఏంటది?'' కంగారుగా అన్నాడు ఆదినారాయణ.

''బాస్కర్డు గారింటికి సాములోరొచ్చారంట. మయిమలు గలోరంట!'' అన్నాడు ఎఱ్ఱేసు.

''ఆయనా?! నీదాకా వచ్చిందా! శ్రీరామరాజుగారు.''

''అలాగా! చాలా గొప్పోడంట కదా, దేవుడేనంటన్నారంతా!''

''అది నిజమే. కానీ నీకెవరు చెప్పారో, ఆయన మహిమలేం చెయ్యరు. పూజాపునస్కారం అంతే. ఆయన్ని చూస్తే బాధలన్నీ పోతాయని అంతా చూసెళతన్నారు. గోడెళ్లబోసుకుంట.....''

''నేనొస్తే మాటాడతారా, సాములు?'' ఆత్రంగా అడిగాడు ఎఱ్ఱేసు.

''ఎవరితోనైనా మాట్లాడతారు.'' భరోసాగా అన్నాడు ఆదినారాయణ.

ఏదో దీర్ఘాలోచనలో మునిగిపోయాడామాట విని, ఎఱ్ఱేసు.

మధ్యాహ్నం మూడు గంటలవుతోంది. దుకాణాలు కట్టేయడం మొదలైంది. బళ్లూ సిద్ధమవుతున్నాయి. చీకటి పడే లోపున కొండ దిగాలి.

దూరంగా ఒక షావుకారు పిలుస్తున్నాడు, ''ఒరేయ్! ఎఱ్ఱేసు! చింతపండు ఎక్కించాలి, రా! మోదిగాడేడి?''

''చిత్తం బాబూ!'' అంటూ అటు అడుగు వేశాడు ఎఱ్ఱేసు.

అప్పుడే పిలిచాడు ఆదినారాయణ. ''ఇదిగో ఎఱ్ఱేసు! ఉడుం చర్మం అడిగాను, కంజరి కోసం. ఆరు నెలలైంది...!'' అన్నాడు, కొంచెం మొహమాటంగా.

''ఆదినారాయణ! ఉడాన్ని పట్టుకోవడం తేలిక్కాదు. ఒరే ఎఱ్ఱేసు! ఇదో వచ్చాను. నా తోలు ఒలిచి పట్టుకెళ్లి ఆ కంసాళ్లబ్బాయికి ఇచ్చీరా అని ఏ ఉడుమూ ఎదుర్రాదు.'' అన్నాడు నవ్వుతూ.

''అడవిలో బాగా దొరుకుతాయి కదా!''

''దొరుకుతాయి. ఉడుం తోలు సంగతేమో కానీ, అడవిలో అడుగు పెడితే ఫారెస్టోడు కొండోళ్ల తోలు తీసేస్తన్నడు. బేస్టిన్ దొర ఉన్నాడు చూడు, పెద్ద దానగుడు. మా గుడిసెల చూరు కోసం ఓ బారెడు కొమ్మ కొడితే జల్మానా ఏయించేత్తన్నాడు. ఇంక వేటాడనిస్తాడా?''

''అయ్యో అలాగా! పోనీలే.''

''అయినా పర్లేదు. మంచోడివి నువ్వు. మన దార్లు మనకీ ఉంటాయి. వచ్చేవారం పట్టుకొస్తాలే!'' అంటూ ముందుకువెళ్లాడు ఎఱ్ఱేసు.

ఉదయం ఎప్పుడో పది ప్రాంతంలో ఎఱ్ఱేసును ఏదో వివరం అడిగిన ఆ కొండవాడు ఇంకా అక్కడే ఉన్నాడు. అతడు తెచ్చిన సరుకు తీసుకున్న షావుకారు డబ్బులు ఇవ్వలేదు. ఇంకా పది మందో పదిహేను మందో ఉంటారు, డబ్బులు చేతిలో పడవలసిన గిరిజనులు. రాత్రంతా నడిచిన శ్రమ వాళ్ల ముఖాలలో కనిపిస్తూనే ఉంటుంది. నెత్తి మీద పెద్ద చింతపండు బుట్లో, కట్టెల మోపో, అడ్డాకులో, కావడి వేసుకుని ఓ పది పనసకాయలో పట్టుకు వస్తాడు. ఎవరో షావుకారు పిలుస్తాడు. గెడ్డం కింద చేతికఱ్ఱ ఆన్చి నిలబడే వాళ్లు కొందరు. గొంతుక్కూచుని షావుకారు పిలుపుకోసం నిరీక్షించేవాళ్లు ఇంకొందరు. సాయంత్రం వెళ్లేటప్పుడు షావుకార్లు డబ్బులు విదిలిస్తారు– ముష్టి పారేసినట్టు. షావుకారు ముందు ఇస్తానన్నది ఎంతో, చివరికి చేతిలో పడేసినది ఎంతో కొండవాడికి తెలియదు. ఏ సంతయినా ఇంతే.

సంత అంటే చాలు, తలంతా ఆముదం రాసుకుని, ఇన్ని పూలు తురుముకుని, మంచి చీర కట్టుకుని వస్తారు గిరిజన మహిళలు. ఆచ్ఛాదనలు లేని వారి వక్షాల మీద కన్ను వేయని మగాడు దాదాపు కనిపించడు. షావుకార్ల సహాయకుల

కళ్ల మరీ పత్తికాయలైపోతాయి. సాయంకాలానికల్లా కొండ దిగాలన్న సంగతి కూడా మరచిపోయినట్టున్న ఫ్యాన్సీ సామాను అమ్మే ఆ కుర్రాడి కళ్లు పత్తికాయలై చాలా సేపైంది. కొత్త అద్దంలో ముఖం చూసుకుని ఆమె మురిసి పోతూ ఉంటే, కొంగు పక్కకి తప్పుకోవడంతో అనాచ్ఛాదితంగా కనిపిస్తున్న ఆమె నగ్నవక్షం కేసే చూస్తున్నాడు.

కానీ అంతకు మించి ఆశపడితే, ఇంటికి తిరిగి వెళ్లలేమని అలాంటి వాళ్లకి బాగానే తెలుసు. పెద్ద పెద్ద చింతపండు బుట్టలు, తట్టలతో సీతాఫలాల రాశులు బళ్లెక్కుతున్నాయి. కొండ చీపుళ్లతో ఓ బండి చిన్న కొండలా పెరిగింది. శీకాకాయి, కుంకుళ్లు, తుమ్మబంక వేగంగా చేరుతున్నాయి. మోదిగాడి కోసం వెతుకుతూ ఆ సామెతని చెప్పుకున్నాడు ఎర్రేసు–

''కొండోళ్ల పంట, దిగువోళ్ల వంట!''

## 3

ఆశ్వీయుజ మాసం.

దేవీభాగవతంలో ఒక ఘట్టం చెప్పుకున్నాక పేపరు పఠనం మొదలయింది గ్రామచావడిలో.

ఆ ఏడాది అక్టోబర్ 2న గోఖలే హాలులో మద్రాసు పౌరులు ఎంకె గాంధీ పుట్టినరోజును మొదటిసారి జరిపారట. అదీ వార్త. పత్రికలో నుంచి ముఖం బయటకు పెట్టి మరీ చెప్పారు భాస్కరుడు ఇంకో సంగతి, ''కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు కూడా హాజరయ్యారట.''

'అబ్బ!' అన్నట్టు ముఖాలు పెట్టారు శ్రోతలంతా.

మళ్లీ చదవడం ఆరంభించారు.

''భారతదేశంలో రామకృష్ణుని వంటి సర్వసంగ పరిత్యాగులు, గోఖలే వంటి దేశభక్తులు, సాలార్‌జంగ్ వంటి రాజనీతి చతురులు జన్మించారు. గాంధీగారిలో ఆ మూర్తిత్రయంలోని మూడు గుణాలూ ఉన్నవి.....గాంధీగారు మూర్తీభవించిన ఆత్మశక్తి. అన్ని నిరోధాలను ఆయన ఆత్మశక్తితో తొలగించగలరు.' అన్నారట సుబ్రహ్మణ్య అయ్యరు.''

''నిజమే సుమా! రెండేళ్లలో ఎంత ఎదిగిపోయాడయ్యా గాంధీగారు!'' అన్నాడు నారాయణస్వామి నాయుడు, అబ్బురంగా.

''ఆయన కోసమా అన్నట్టు మహామహులంతా తప్పుకుంటున్నారు. లేకపోతే కాలమే తప్పిస్తోంది. అది గమనించరేం? ఎక్కడ తిలక్! ఎక్కడ మాలవ్యా! ఎక్కడ గోఖలే! ఎలాంటి మోతీలాల్, జిన్నాలు! లజపతిరాయ్, బిపిన్‌పాలు, అనిబిసెంటమ్మ, చిత్తరంజన్‌దాసు.....''అన్నాడు భాస్కరుడు వేళ్లు ముడుస్తూ.

''నిజమే! గాంధీ పేరు శూన్యం నుంచి రవళిస్తున్న ఓంకారంలా ఉంది.'' అన్నాడు శ్రీరామరాజు, చివర్న.

## 4

పలకరిస్తే గలగలా మాట్లాడతాడు. అది కూడా ముగ్గురు నలుగురితోనే. లేకపోతే మౌనం. భాస్కరుడి గారికి పోస్టులో వచ్చే పుస్తకాలని గంటల తరబడి చదువుతాడు. రామకృష్ణ మఠం వారి ప్రచురణ ప్రబుద్ధ భారతి పత్రిక అంటే పంచ ప్రాణాలు రామరాజుకి. కూచిమంచి జగ్గకవి పద్యాలంటే ప్రత్యేక శ్రద్ధ. శృంగార నైషధం, మనుచరిత్ర, వసుచరిత్ర, పారిజాతాపహరణం భాస్కరుడి కోరిక మేరకు వ్యాఖ్యానంతో వివరించేవాడు. అప్పుడు యువకులంతా ఉండేటట్టు చూసేవారు భాస్కరుడు.

రామరాజును చూడడం కోసం వచ్చేవాళ్ల సంఖ్య కూడా అంతకంతకూ పెరిగిపోతోంది.

రెండు నెలలకే ఆయన తనకు శివాలయం



భాస్కరుడి తల్లి సోమమ్మ

దగ్గర ఒక పూరిల్లు నిర్మించి ఇమ్మని అడిగాడు. వచ్చిందే ఏకాంతంగా ఉంటూ తపస్సు చేసుకోవడానికి అంటూ తన లక్ష్యం గురించి గుర్తు చేశాడు.

భాస్కరుడితో సహా చాలామందికి ఇష్టం లేదు. సోమమ్మ కంట నీరు పెట్టుకున్నారు. కృష్ణదేవిపేట వాసులు, కొంగసింగి గ్రామస్థులు స్వయంగా కట్టించి పెట్టారు ఆ చిన్న కుటీరం.

ఆ కుటీరంలోకి నవంబర్ 25, 1917న రామరాజు ప్రవేశించాడు. పాలూ పళ్లూ భాస్కరుడిగారింటి నుంచే వెళ్లేవి.

కానీ ఊరు నుంచి రామరాజు కొంచెం దూరంగా జరిగినా, ఊరు మాత్రం ఆయనను విడిచిపెట్టలేదు. అప్పుడే కృష్ణదేవిపేటకి పక్క గ్రామం కొంగసింగికి మండల దీక్ష కోసం రామరాజు వెళ్లాడు. ఆ ఊరి ప్రజలే అక్కడ దీక్ష నిర్వహించవలసిందని అడిగారు.

నలభయ్ రోజుల తరువాత తిరిగి వచ్చాక మళ్లీ భాస్కరుడిగారింటే మకాం ఉండవలసి వచ్చింది. కారణం– అక్కడ కుటీరం నిర్మించడం కుదరదని గూడెం డిప్యూటీ తహసీల్దారు బాస్టియన్ ఆదేశం పంపాడు. వెంటనే తొలగించారు.

''పోనీలే బాబయ్యా! అదీ ఒకందుకు మంచిదే. అలాంటి అడవిలో ఒక్కడూ ఉండడానికి ఏ తల్లి ఒప్పుకుంటుంది? '' అంది సోమమ్మ. మళ్లీ ఆమే అడిగారు.

''బాబయ్యా! ఎప్పట్నించో అనుకుంటున్నాను. తమకి నిండా ఇరవై ఏళ్లు. ఎవరూ లేరా? దాచకుండా చెప్పాలి! ఎక్కడున్నారు?'' చనువుగా, ప్రేమగా అడిగిందా పెద్దమనసు.

''లేకేమి ఉన్నారు! అమ్మ, చెల్లి, తమ్ముడు. ఇంటికి పెద్దవాడిని నేనే. ఇల్లు విడిచి రెండేళ్లయింది. అయినా చింత పడక్కరలేదు. వాళ్లకి ఏ లోటూ ఉండదు. మా బంధుకోటి కూడా పెద్దదే.'' అన్నాడు రామరాజు.

''తమరి తండ్రిగారి మాటేదీ చెప్పలేదు!'' గుర్తు చేస్తున్నట్టుగా అంది సోమమ్మ.

''నా చిన్నతనంలోనే పోయారు'' చెప్పాడు రామరాజు.

గట్టిగా నిట్టూర్చి పైకే అన్నదామె. ''మంచి స్వామివి! తల్లి మనసు పడే గుంజాటన గురించి మీ తపస్సు, చదువు చెప్పలేదా? ధనధాన్యాలకి లోటుండకపోవచ్చు. బంధుగణం ఉండొచ్చు. కానీ కడుపున పుట్టిన బిడ్డ ఎక్కడున్నాడో తెలీకపోతే ఆ తల్లి మనసు ఎలా నిలుస్తుందయ్యా! అటు పెనిమిటీ లేక, ఇటు పెద్దకొడుకు ఏమయ్యాడో తెలీక ఆ అమ్మ ఎంత కుంగిపోయిందో! తలుచుకుంటే నాకే కన్నీళ్లు ఆగడం లేదు. తమరు ఇప్పుడే నాకు చెప్పాలి మీ ఊరు, మీ ఇల్లు......''

●●●

*''హలో...! నర్సీపట్నం హెడ్‌క్వార్టర్స్... హెడ్‌క్వార్టర్స్.... ఓవర్....'' వైర్‌లెస్ గాండ్రించింది.*

*పచార్లు చేస్తున్న ఫర్బీస్ ఒక్క ఉదుటన వచ్చి గట్టిగా అన్నాడు, ''హలో... హలో... కేడీపేట క్యాంప్.. ఓవర్.''*

*''అక్కడున్న నాలుగు పటాలాలనీ వెంటనే సిద్ధం చేయండి! బహుశా కొయ్యూరు బయలుదేరాలి. ఓవర్.''*

*''ఐదు నిమిషాల్లో సిద్ధం చేస్తాను. ఓవర్.'' అంటూనే అక్కడే అటెన్షన్‌లో నిలబడి ఉన్న కానిస్టేబుల్‌కు సైగ చేశాడు ఫర్బీస్. అతడు డేరాల వైపు పరుగు తీశాడు. అస్సాం రైఫిల్స్, మలబారు దళాలు, ఇక్కడి పోలీసులు...ఆ పిలుపు కోసమే ఎదురు చూస్తున్నారు. కానిస్టేబుల్ చెప్పగానే యూనిఫారాలు అందుకోవడం ప్రారంభించారు. బయట, స్టార్ట్ చేసిన రెండు లారీలు ఆ పక్క నుంచి శిబిరం దిశగా నడుస్తున్న శబ్దం....*

*(తరువాయి భాగం వచ్చేవారం)*

**• ఇంటికి - ఒంటికి**



# రాళ్లల్లో... రంగులేసిన రాళ్లు వేరయా...

కళ ఉంటే చాలు గులకరాళ్లు కూడా గువ్వలైపోతాయి. రెక్కలాడించే గోరువంకలైపోతాయి. రివ్వున ఎగిరే సీతాకోక చిలుకలైనా... మన ఇళ్లల్లో తిరిగే హచ్ కుక్కలైనా కళాఖండాలై చూపరులను కట్టిపడేస్తాయి. మనం సేదతీరేందుకు గోదావరి గట్టుకెళ్లినా, సాగరతీరానికి చేరినా.. కంటపడేవి, కాళ్లపడేవి రాళ్లే. పెద్దరాయి, గులకరాయి అనే తేడా లేకుండా సేకరించి ఇంటికి తెచ్చుకుంటే చాలు. ఆకర్షించే అందాలను మీరే పండించొచ్చు. ఇంటికొచ్చే అతిథులతో ఔరా అనిపించొచ్చు. ఈ చిత్రాలను చూడండి. రంగురంగుల ముగ్గులు, బొమ్మలు. వావ్ అమేజింగ్ అనిపిస్తోంది కదూ. ఇవ్వన్నీ రంగులద్దిన రళ్లే. లైట్ స్టోన్స్‌తో నెమలిని ఫ్రేమ్ చేసుకోవచ్చు. వైట్ స్టోన్‌తో సంధ్యవేళను తలిచే ప్రకృతిని మెరిపించొచ్చు. పెద్ద రాళ్లకు రంగు పులిమి ఫ్లవర్‌వేజుల్లో పెట్టుకోవచ్చు. చిన్న రాళ్లకు రంగు పులిమి చేపల టబ్బుల్లో వేసుకోవచ్చు. మరి ఇంకెందుకు ఆలస్యం మీరు ప్రయత్నించండి.









సేకరణ: సంహిత నిమ్మన



# వైరైటీగా...

మీ ఇంట్లో పాత కరెంట్ వైర్లు ఉన్నాయా? అయితే ఓ సారి బైటకి తీయండి. కత్తిలాంటి మోడల్ జ్యూవలరీని తయారు చేసుకుందాం. పాత వైర్లతో జ్యూవలరీనా అనుకుంటున్నారు కదూ? ఇక్కడ ఫొటోస్ చూస్తే అర్థమవుతుంది. వైరా మజాకా అని. మీ దగ్గర రంగురంగుల వైర్లు ఉంటే ఇంకా మంచిది. మీకు కావాల్సిన డ్రెస్‌కు, కావాల్సిన కలర్స్‌లో... ఇయర్‌రింగ్స్, దండలు, గాజులు, బ్రేస్‌లెట్‌లే కాదు ఉంగరాలు కూడా చేసుకోవచ్చు. "పనికిరాదనుకున్న వస్తువు ఏదో రూపంలో ఉపయోగపడుతుందంటే ఆ కిక్కే వేరబ్బా" అంటారా? అయితే, ఈ వెరైటీ వైర్ మోడల్స్‌ని ఫాలో అవ్వాల్సిందే.








## • సాల్వ్ చేస్తారా? శీర్షాసనమేస్తారా?

### • మాయా బజార్

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 | | | ■ | ■ | 2 | |
| | ■ | ■ | ■ | ■ | | ■ |
| 3 | 4 | | | | ■ | 5 |
| ■ | | ■ | ■ | ■ | | |
| 6 | | ■ | 7 | ■ | 8 | |
| | ■ | 9 | | 10 | ■ | |
| | ■ | | ■ | | ■ | |

**అడ్డం:** 1. ప్రభాస్ 'శివుడు', రానా దగ్గుబాటి 'బల్లాలదేవా', అనుష్క 'మహారాణి దేవసేన' తమన్నా 'అవంతిక', పాత్రలలో నటించిన ఈ చిత్రానికి యస్.ఎస్.రాజమౌళి దర్శకుడు.(4)
2. యండమూరి వీరేంద్రనాథ్ నవల 'థ్రిల్లర్' ఆధారంగా వచ్చిన సినిమా. పేరులో 'ముత్యం' అంతా ఎగిరిపోయింది (2)
3. హరీష్ శంకర్ రచన, దర్శకత్వం చేసిన ఈ చిత్రంలో ఎన్టీఆర్ 'నందు' 'రాము'గా నటించారు. రెండవ అక్షరం బ్లాకైంది. అటు నుంచి (7)
6. భీమినేని శ్రీనివాసరావు దర్శకత్వంలో అల్లరి నరేష్ హీరోగా వచ్చిన స్పూఫ్ కామెడీ ఫిల్మ్. టైటిల్‌లో మొదటి రెండక్షరాలు ఎక్కడో ఎగిరిపోయాయి (2)
8. ప్రముఖ నటుడి కుమారుడు. పన్నెండు చిత్రాల దర్శకుడు. నటుడు. రచయిత. దర్శకుడిగా 'అల్లరి' ఆయన మొదటి చిత్రం. 'బాబు' ఎందుకులేండి... సింపుల్‌గా పేరు చాలు. అటు నుంచి (2)
9. దాసరి నారాయణరావు దర్శకత్వంలో అక్కినేని నాగేశ్వర్రావు, జయప్రద, జయసుధ ప్రధాన పాత్రలలో నటించిన చిత్రం. రెండవ అక్షరం బ్లాకై పోయింది. అటునుంచి (5)

**నిలువు:** 1. బాలకృష్ణను అభిమానులు ముద్దుగా ఇలా పిలుచుకుంటారు (3)
2. ఏవీయం బ్యానర్‌లో రామకృష్ణ, చంద్రకళ, శరత్‌బాబు, జయసుధ, కే.వి.చలం ప్రధాన పాత్రలు పోషించిన చిత్రం. సత్యం సంగీతదర్శకత్వం వహించారు. సినిమా పేరు కింది నుంచి (2)
4. అల్లు అర్జున్, ఆర్యా...హీరో, విలన్‌లుగా నటించిన చిత్రం (3)
5. విలన్ పాత్రలతో సుప్రసిద్ధుడైన నటుడి కుమారుడు. 'గబ్బర్‌సింగ్' 'సీతమ్మ వాకిట్లో సిరిమల్లె చెట్టు' 'మగధీర' 'సినిమా చూపిస్తా మామా'... చిత్రాలు ఆయనకు నటుడిగా మంచి పేరు తీసుకువచ్చాయి (5)
6. ప్రియదర్శన్ దర్శకత్వంలో బాలకృష్ణ, అక్కినేని నాగేశ్వర్రావు నటించిన ఈ సినిమాలో మోహన్‌లాల్ ఒక పాటలో కనిపిస్తారు. టైటిల్‌లో సున్నా మిస్సయింది (3)
7. దేవిశ్రీప్రసాద్ తొలిసినిమా. కింది నుంచి (2)
9. శివ దర్శకత్వంలో గోపీచంద్, త్రిష జంటగా నటించిన సినిమా. అనిల్ రావిపూడి సంభాషణలు రాశారు. థమన్ సంగీతం సమకూర్చారు (2)
10. విక్రమన్ దర్శకత్వంలో వెంకటేష్, ఆర్తి అగర్వాల్, కళ్యాణి, చంద్రమోహన్...ప్రధాన పాత్రలు పోషించారు. ఎస్.ఏ.రాజ్‌కుమార్ సంగీతం సమకూర్చారు. మొదటి అక్షరం ఎగిరిపోయింది (2)

### • మైథోగ్రఫీ

1. ప్రహ్లాదుని తండ్రి.

◇◇◇◇◇◇◇

2. ఇతడికి, ఊర్వశికీ మధ్య ఎడబాటుకు ఒక గంధర్వుడు ప్రయత్నిస్తాడు. పై జవాబులో '6'వ అక్షరంతో...

◇◇◇◇◇

3. మన్మథుడి భార్య... 2వ జవాబులో '3'వ అక్షరంతో...

◇◇◇◇

4. కల్కి తండ్రి... పై జవాబులో '4'వ అక్షరంతో...

◇◇◇◇◇

5. త్రిమూర్తులలో ఒక దేవుడు... 4వ జవాబులో మొదటి అక్షరంతో...

◇◇◇◇

### • బ్రెయిన్ జిమ్

1. నువ్వు నా బ్రదర్. కాని నేను నీ బ్రదర్ కాదు. ఎవరిని?
2. ఇటు నుంచి చూసినా అటు నుంచి చూసినా... ఒకే రకంగా కనిపించే పదం.
3. రసం కాని రసం.
4. ఎంత ముందుకు వెళితే... అంత వెనక ఉంటాయి. ఏమిటవి?

| | | | | |
|---|---|---|---|---|
| సి | నీ | ర | సం | S |
| స్ట | V | అ | M | K |
| ర్ | G | I | P | ము |
| R | W | N | ద | ద్ర |
| S | D | పా | వ | లు |

### జవాబులు

**బ్రెయిన్ జిమ్**

**మైథోగ్రఫీ**
1. హిరణ్యకశిపుడు 2. పురూరవుడు
3. రతీదేవి 4.విష్ణుయశుడు 5. విష్ణుమూర్తి

**మాయా బజార్**
**అడ్డం:** 1. బాహుబలి 2. (ముత్యమంత) ముద్దు
3. రామయ్య వస్తావయ్య 6. సుడిగాడు
8. రవి(బాబు) 9. మేఘసందేశం
**నిలువు:** 1. బాలయ్య 2. నోము 4. వరుడు
5.రావు రమేష్ 6. గాండీవం 7. దేవి
9. శంఖం 10. (వ) సంతం

### • కిసుక్కు

జడ్జి: పెళ్లై ఆరు నెలలు కూడా కాలేదు. అప్పుడే విడాకులు కావాలనుకుంటున్నారు ఎందుకు?

ప్రసాద్: బజారుకు వెళ్లినప్పుడు నా కంటే ముందు నడుస్తుంది. నాతో సమానంగా నడవమంటే వినడం లేదు. అందుకని.

– వై.మురహరిరావు, హైదరాబాద్

### • మీకు తెలుసా?

డిప్రెషన్‌లో ఉన్నప్పుడు... మామూలుగా ఉన్నప్పటి కంటే మూడు నుంచి నాలుగు రెట్లు ఎక్కువ కలలు కంటారట!

## పదశోధన - 423

నిర్వహణ : **అదృష్టదీపక్**

### ఆధారాలు

**అడ్డం**

1. కంటికి కనిపించని భాగ్యం, తెలుగు లక్ (3)
4. ఎరుపు, పద్మరాగమణి (2)
6. బంగారు కొండ (5)
7. రాజుల వెంట ఉండే హాస్యగాడు (5)
9. ఆనతి, ఆజ్ఞ (2)
10. పతనమగు, కిందపడు (2)
11. పెడముఖం పెట్టి వినండి (3)
13. అద్దె, బాడుగ (3)
16. అటు నుంచి మాటు వెయ్యండి (2)
17. సింహపు పిల్ల - చిరంజీవి సినిమా (5)
19. చెక్కిలి (2)
21. ఇంగ్లిష్‌లో సున్న చుట్టండి (2)
23. లోహాలకు పుట్టినిల్లు (2)
24. శతకోటి దరిద్రాలకు విరుగుడు సామెత (9)
27. వేగం (2)
14. సగమే ఉన్న రామాయణం (2)
15. ఆంజనేయుడి ఆయుధం (2)
17. కోడికూత (4)
18. సింగడి భార్య (2)
19. ఎర్ర కలువ (4)
20. చేత, కర్మ, వృత్తి (2)
21. వేతనం (3)
22. పైకి విసరిన ఉలి (2)
24. తల్లి (2)
25. హోటల్‌లో సర్వర్‌కి ఇచ్చేది (2)
26. గీతం (2)

**నిలువు**

1. అరణ్యం (3)
2. కడచిన సంవత్సరం (3)
3. పండుగ రోజు (4)
5. జన్మదినం (5)
6. వస్తువులు తగిలించడానికి గోడకు కొట్టేవి (3)
8. బొందులాగు (3)
12. పెళ్లి (3)
13. గుట్టు, మర్మం (3)

### పదశోధన - 422 జవాబు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1ఊ | పి | 2రి | | 3బా | ల | 4వా | క్కు | | 5వ |
| హ | | వ | | వు | | టా | | 6త | ల |
| | 7క | ట | 8క | టా | 9లు | | 10కా | మం | దు |
| 11ఖై | దు | | ల | | 12ట | 13ము | కు | | వ |
| | 14ము | ద్ద | బం | 15తి | పు | వ్వు | లు | | ల |
| 16అ | | | 17ద | రి | | రు | | 18ఐ | దు |
| 19తి | ల | 20కం | | 21పం | 22జా | | | లా | |
| వి | | 23దు | ప్పి | | మా | | 24ఆ | యు | వు |
| న | | కం | | 25కూ | త | | శ్రే | | |
| 26యం | త | | 27గా | లి | | 28అ | య | స్కాం | తం |

### • టేస్టీ టేస్ట్

**నిలువు:** 1. సారీ... గుత్తి వంకాయ కూర కాదు. చేదుగా ఉంటుంది.
2. ఈ కర్రీ రూట్ ఏమీ మార్చలేదు. ఎప్పటి నుంచో అదే రుచి.
3. ఈ కూరలో 'నస' ఉన్నమాట నిజమేగానీ... తింటున్నప్పుడు 'నస' పెట్టే అవకాశమే లేదు.
4. లొల్లి లేకుండా హాయిగా లొట్టలు వేస్తూ తినేయవచ్చు. ఈ పచ్చడి పేరు కింది నుంచి.

**అడ్డం:** 2. జీరాలు పోవడం కాదు. మాంచి టేస్ట్ ఉన్న పచ్చడి.
5. కట్ చేస్తే... ఘాటు ఘాటు యమ టేస్టీ రుచి. అటు నుంచి.

**జవాబు**
నిలువు: 1.గుత్తికాకరకాయకూర 2. బీట్‌రూట్‌కర్రీ 3. పనసకాయకూర 4. ఉల్లిపచ్చడి
అడ్డం: 2.బీరకాయ పచ్చడి 5.కట్ మిర్చీ

### సుడోకు - 183

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 5 | 1 | | 3 | | | | | 9 |
| 7 | | 3 | 5 | 8 | | | | 4 |
| | 4 | | | 1 | 9 | | | |
| | | | | 4 | 3 | 8 | | |
| | 7 | 4 | | 6 | | 5 | 2 | |
| | | 9 | 1 | 2 | | | | |
| | | | 4 | 3 | | | 6 | |
| 4 | | | | 5 | 6 | 9 | | 8 |
| 2 | | | | | 1 | | 5 | 3 |

కఠిన స్థాయి 1 2 3 4 5

### సుడోకు 182 జవాబు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 6 | 2 | 9 | 7 | 5 | 4 | 1 | 3 | 8 |
| 8 | 7 | 4 | 3 | 1 | 2 | 9 | 6 | 5 |
| 3 | 5 | 1 | 8 | 6 | 9 | 2 | 7 | 4 |
| 4 | 6 | 7 | 2 | 9 | 5 | 8 | 1 | 3 |
| 1 | 8 | 3 | 4 | 7 | 6 | 5 | 9 | 2 |
| 2 | 9 | 5 | 1 | 3 | 8 | 7 | 4 | 6 |
| 5 | 4 | 6 | 9 | 2 | 7 | 3 | 8 | 1 |
| 7 | 3 | 8 | 5 | 4 | 1 | 6 | 2 | 9 |
| 9 | 1 | 2 | 6 | 8 | 3 | 4 | 5 | 7 |

## 12 ఫిబ్రవరి నుంచి 18 ఫిబ్రవరి 2017 వరకు

సింహంభట్ల సుబ్బారావు
జ్యోతిష్య పండితులు





**మేషం:** (అశ్వని, భరణి, కృత్తిక 1 పా.)
నూతనోత్సాహంతో కార్యక్రమాలు పూర్తి చేస్తారు. నిరుద్యోగులకు ఉద్యోగాన్వేషణలో విజయం. పలుకుబడి కలిగిన వ్యక్తులు పరిచయమవుతారు. గతంలో జరిగిన పొరపాట్లు సరిదిద్దుకుని ముందుకు సాగుతారు. కోర్టు వ్యవహారాలు, ఇతర సమస్యల నుంచి కొంత విముక్తి. తీర్థయాత్రలు చేస్తారు. వ్యాపారాభివృద్ధి. ఉద్యోగులకు పదోన్నతులు. పారిశ్రామికవర్గాలకు ప్రోత్సాహం. ఎరుపు, లేత గులాబీ రంగులు, ఉత్తరదిశ ప్రయాణాలు అనుకూలం. శివాష్టకం పఠించండి.



**వృషభం:** (కృత్తిక 2,3,4 పా., రోహిణి, మృగశిర 1,2 పా.)
ఆర్థిక లావాదేవీలు కొంత అనుకూలం. నూతన విద్య, ఉద్యోగావకాశాలు దక్కవచ్చు. మీనుంచి సన్నిహితులు సాయం కోరతారు. కొంత శ్రమపడ్డా అనుకున్న పనులు పూర్తి కాగలవు. ఆరోగ్యం కొంత మందగిస్తుంది. స్థిరాస్తి విషయంలో ఒప్పందాలు. వ్యాపారాలు లాభసాటిగా సాగుతాయి. ఉద్యోగస్తులకు గుర్తింపు. రాజకీయవర్గాలకు ఆకస్మిక విదేశీ పర్యటనలు. నీలం, చాక్లెట్ రంగులు. పశ్చిమదిశ ప్రయాణాలు అనుకూలం. కనకదుర్గాదేవి స్తోత్రాలు పఠించండి.



**మిథునం:** (మృగశిర 3,4, ఆరుద్ర, పునర్వసు 1,2,3 పా.)
రుణబాధలు, సమస్యలు తీరే సమయం. చేపట్టిన కార్యక్రమాలలో విజయం సాధిస్తారు. విలువైన సామగ్రి కొనుగోలు. విద్యార్థులకు అనుకూల ఫలితాలు. ఆరోగ్యం కొంత ఇబ్బంది పెట్టవచ్చు. సోదరులు, సోదరీలతో వివాదాల సర్దుబాటు. దేవాలయాలు సందర్శిస్తారు. ముఖ్య నిర్ణయాలలో కుటుంబ సభ్యుల సలహాలు తీసుకుంటారు. వ్యాపారాలలో కొత్త పెట్టుబడులు అందుతాయి. ఉద్యోగస్తులకు కొత్తహోదాలు. లేతఆకుపచ్చ, గులాబీ రంగులు, దక్షిణదిశ ప్రయాణాలు అనుకూలం. శివాలయ దర్శనం ఉత్తమం.



**కర్కాటకం:** (పునర్వసు 4 పా., పుష్యమి, ఆశ్లేష)
ఎంతగా కష్టించినా ఆశించిన ఫలితం కనిపించదు. ఆరోగ్య, కుటుంబసమస్యలు చికాకుపరుస్తాయి. ఆధ్యాత్మిక కార్యక్రమాలలో పాల్గొంటారు. సోదరులతో వివాదాలు నెలకొంటాయి. విద్యార్థులు, నిరుద్యోగులు చేసేయత్నాలు మందగిస్తాయి. వ్యాపారాలు స్వల్పంగా లాభిస్తాయి. ఉద్యోగస్తులకు పని ఒత్తిడి. రాజకీయవర్గాలకు పర్యటనలు వాయిదా. అయితే వారం చివరిలో అనూహ్యంగా అనుకూల ఫలితాలు పొందుతారు. గులాబీ, లేత పసుపు రంగులు, తూర్పుదిశప్రయాణాలు అనుకూలం. విష్ణుసహస్రనామ పారాయణ చేయండి.



**సింహం:** (మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)
ఉత్సాహంగా కార్యక్రమాలు పూర్తి చేస్తారు. సంఘంలో గౌరవం. ఆదాయానికి లోటు ఉండదు. మీ నిర్ణయాలను కుటుంబసభ్యులు ప్రశంసిస్తారు. ఆస్తి వివాదాలు తీరతాయి. ఇంటి నిర్మాణయత్నాలు కార్యరూపం దాలుస్తాయి. తీర్థయాత్రలు చేస్తారు. విద్యార్థులు లక్ష్యాలు సాధించే దిశగా పయనిస్తారు. ఆరోగ్యం కుదుటపడుతుంది. వ్యాపారాలు సజావుగానే సాగుతాయి. ఉద్యోగులకు పదోన్నతులు రాగలవు. పారిశ్రామికవర్గాలకు సన్మానయోగం. తెలుపు, ఆకుపచ్చ రంగులు, ఉత్తరదిశ ప్రయాణాలు అనుకూలం. హనుమాన్ ఛాలీసా పఠించండి.



**కన్య:** (ఉత్తర 2,3,4 పా., హస్త, చిత్త1,2 పా.)
పరిచయాలు పెరుగుతాయి. అనుకున్న విధంగా పనులు పూర్తి చేస్తారు. సోదరులు,సోదరీలతో సఖ్యత ఏర్పడుతుంది. కుటుంబంలో శుభకార్యాలు నిర్వహిస్తారు. రాబడి కొంత పెరిగి అవసరాలు తీరతాయి. భూవివాదాల నుంచి బయటపడతారు. సంఘంలో విశేష గౌరవం లభిస్తుంది. విద్యార్థులకు శుభవార్తలు అందుతాయి. వ్యాపారాలు లాభసాటిగా ఉంటాయి. ఉద్యోగస్తులకు ఇంక్రిమెంట్లు. రాజకీయవర్గాలకు పదవీయోగం. నేరేడు, బంగారు రంగులు, దక్షిణదిశ ప్రయాణాలు అనుకూలం. కనకధారాస్తోత్రం పఠించండి.



**తుల:** (చిత్త 3,4, స్వాతి, విశాఖ1,2,3 పా.)
ఆశించిన ఆదాయం సమకూరుతుంది. ఆలోచనలు కార్యరూపం. మీ నైపుణ్యం వెలుగులోకి వస్తుంది. ఆశ్చర్యకరమైన విషయాలు తెలుసుకుంటారు. తీర్థయాత్రలు చేస్తారు. ఇంటి నిర్మాణాలు చేపట్టే వీలుంది. శత్రువులు మిత్రులుగా మారతారు. ఆరోగ్యం కొంత మందగిస్తుంది. ఉద్యోగులకు ఇంక్రిమెంట్లు రాగలవు. కళాకారులకు పురోగతి. పసుపు, ఆకుపచ్చరంగులు, తూర్పుదిశ ప్రయాణాలు అనుకూలం. దుర్గాదేవికి కుంకుమార్చనలు చేయండి.



**వృశ్చికం:** (విశాఖ 4 పా., అనూరాధ, జ్యేష్ఠ)
అనుకున్న రాబడి పొందుతారు. బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. దూరప్రాంతాల నుంచి పిలుపు రావచ్చు. ఒక అవకాశం అప్రయత్నంగా లభిస్తుంది, సద్వినియోగం చేసుకోండి. సంతానరీత్యా మంచి పేరు లభిస్తుంది. వాహనాలు కొనుగోలు చేస్తారు. వ్యాపారాలు సజావుగా సాగుతాయి. ఉద్యోగస్తులకు ఊరట. పారిశ్రామికవర్గాలకు అనూహ్యమైన ఆహ్వానాలు. ఎరుపు, నేరేడు రంగులు, ఉత్తరదిశ ప్రయాణాలు అనుకూలం. దేవీఖడ్గమాల పఠించండి.



**ధనుస్సు:** (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)
ఇంతకాలం పడిన శ్రమ ఫలిస్తుంది. చేపట్టిన కార్యక్రమాలు విజయవంతంగా సాగుతాయి. ప్రముఖుల నుంచి కీలక సమాచారం. మీ నేర్పు, ఓర్పుతో సమస్యలు పరిష్కరించుకుంటారు. స్థిరాస్తి వివాదాలు కొలిక్కి వస్తాయి. కొన్ని బాకీలు సైతం వసూలవుతాయి. విద్యార్థులకు ఉత్సాహవంతంగా ఉంటుంది. వ్యాపారాలు ఆశాజనకంగా ఉంటాయి. ఉద్యోగస్తులకు పనిభారం కొంత తగ్గుతుంది. రాజకీయవర్గాలకు కొత్త పదవులు దక్కుతాయి. బంగారు, తెలుపు రంగులు, పశ్చిమదిశ ప్రయాణాలు అనుకూలం. గణేశాష్టకం పఠించండి.



**మకరం:** (ఉత్తరాషాఢ 2,3,4, శ్రవణం, ధనిష్ఠ 1,2 పా.)
నిరుద్యోగులకు శుభవార్తలు. సేవాకార్యక్రమాలపై దృష్టి పెడతారు. ఆలోచనలు కార్యరూపం దాలుస్తాయి. ఆర్థిక సమస్యలు తీరి, రుణఒత్తిడులు తొలగుతాయి. తీర్థయాత్రలు సాగిస్తారు. దూరపు బంధువుల నుంచి ముఖ్య సమాచారం అందే అవకాశం. యుక్తితో వ్యవహరించి కార్యక్రమాలు పూర్తి చేస్తారు. సంఘంలో పేరుప్రతిష్ఠలు పొందుతారు. వ్యాపారాలు సాఫీగా కొనసాగుతాయి. ఉద్యోగులకు హోదాలు, రాజకీయవర్గాలకు నూతనోత్సాహం. నీలం, ఆకుపచ్చరంగులు, దక్షిణదిశ ప్రయాణాలు అనుకూలం. హనుమాన్ చాలీసా పఠించండి.



**కుంభం:** (ధనిష్ఠ 3,4, శతభిషం, పూర్వాభాద్ర 1,2,3 పా.)
బంధుమిత్రుల నుంచి సహాయం కోరతారు. ఆర్థిక విషయాలలో ఒడిదుడుకులు ఎదురైనా అధిగమిస్తారు. పలుకుబడి కలిగిన వ్యక్తులు పరిచయమవుతారు. అనుకున్న ఆశయాలు సాధనలో మిత్రులు సహకరిస్తారు. ఇంటిలో శుభకార్యాలు. నిరుద్యోగుల యత్నాలు ఫలిస్తాయి. వ్యాపారాలలో లాభాలు దక్కవచ్చు. ఉద్యోగులకు వారం చివరిలో అనుకూల పరిస్థితి. కళాకారులు అవకాశాలు దక్కించుకునేందుకు మరింత కృషి చేయాలి. నలుపు, లేత గులాబీరంగులు, తూర్పుదిశ ప్రయాణాలు అనుకూలం. విష్ణుధ్యానం చేయండి.



**మీనం:** (పూర్వాభాద్ర 4 పా., ఉత్తరాభాద్ర, రేవతి)
ఆర్థిక పరిస్థితి మెరుగవుతుంది. సన్నిహితులు, మిత్రులతో వివాదాలు సర్దుబాటు కాగలవు. ఆలోచనలు అమలు చేస్తారు. ప్రతిభావంతులుగా గుర్తింపు రాగలదు. వాహనాలు, గృహ కొనుగోలు యత్నాలు కలిసివస్తాయి. సభలు, సమావేశాలలో పాల్గొంటారు. ఒక ఆహ్వానం సంతోషం కలిగిస్తుంది. కోర్టు కేసులు పరిష్కారమవుతాయి. వ్యాపారాలు సజావుగా సాగుతాయి. ఉద్యోగులకు ఉన్నత హోదాలు. రాజకీయవర్గాలకు పదవులు, సన్మానాలు. ఎరుపు, పసుపు రంగులు, పశ్చిమదిశ ప్రయాణాలు అనుకూలం. దత్తాత్రేయుని పూజించండి.

• టారో

12 ఫిబ్రవరి నుంచి 18 ఫిబ్రవరి 2017 వరకు












టారో ఇన్సియా
అనలిస్ట్

**మేషం (మార్చి 21 - ఏప్రిల్ 19)**

అవసరాలకు తగిన డబ్బు చేతికందుతుంది. సంతోషంగా ఉంటారు. కొత్త ప్రాజెక్టు లేదా పనిని ప్రారంభించాలన్న ఉత్సాహంతో ఉంటారు. పెట్టుబడులకు ఇది తగిన సమయం. ప్రేమికులకు ఆశాభంగం తప్పదు. ఏకాంతంగా ఉన్నప్పుడు ధ్యానం చేయండి, కొన్ని సమస్యలకు పరిష్కారం లభిస్తుంది. జీవితం అనే నౌక పూర్తిగా మన చేతుల్లో ఉండదు. ఒకోసారి గాలి వాలును బట్టి దిశను మార్చుకోవచ్చు.

**కలిసొచ్చే రంగు: గులాబీ**

**వృషభం (ఏప్రిల్ 20 - మే 20)**

ప్రేమలో కొద్దిపాటి పురోగతి సాధిస్తారు. జీవిత లక్ష్యాలను సాధించాలని దృఢంగా నిశ్చయించుకుంటారు. ఆ ప్రయత్నంలో కొద్దిగా ముందడుగు వేస్తారు కూడా! పాజిటివ్ ఆలోచనలతో ఉంటారు. ఇతరుల సమస్యలను విని, మీకు చేతనైన సాయం చేస్తారు. అలా సాయం చేయడం వల్ల ఆనందాన్ని పొందుతారు. మీరు విద్యార్థులైతే మంచి మార్కులు సాధించి, అందరినీ ఆకట్టుకుంటారు.

**కలిసొచ్చే రంగు: బూడిద రంగు**

**మిథునం (మే 21 - జూన్ 20)**

వ్యాపారం మూడు పువ్వులు ఆరుకాయలన్నట్లుగా సాగుతుంది. మీకు కావలసిన వారి కోసం బాగా ధనం ఖర్చు చేస్తారు. గత జ్ఞాపకాలతో కుంగిపోకుండా, వాటినుంచి పాఠాలను నేర్చుకునే ప్రయత్నం చేయడం మంచిది. మీ సమస్యలకు పరిష్కారం కోసం తీవ్రంగా కృషి చేస్తారు. వాహనాలను నడిపేటప్పుడు అప్రమత్తంగా ఉండటం అవసరం. జీవిత భాగస్వామి కోసం అన్వేషించే ప్రయత్నాలు ఫలిస్తాయి.

**కలిసొచ్చే రంగు: నీలం**

**కర్కాటకం (జూన్ 21 - జూలై 22)**

మీ సన్నిహితులతో వీలయినంత నిజాయితీగా, నిర్మొహమాటంగా వ్యవహరించడం మంచిది. దానివల్ల లేనిపోని అపార్థాలు తలెత్తకుండా ఉంటాయి. భాగస్వామ్య వ్యాపారాలు లేదా వ్యవహారాలు అనుకూలిస్తాయి. ఇతర వ్యాపకాలలో పడి వ్యక్తిగత జీవితాన్ని పాడు చేసుకోవద్దు.

**కలిసొచ్చే రంగు: నారింజ**

**సింహం (జూలై 23 - ఆగస్ట్ 22)**

రకరకాల కారణాల వల్ల పని పేరుకుపోవడంతో అవిశ్రాంతంగా శ్రమించవలసి వస్తుంది. దానివల్ల మీకు మంచి పేరు వస్తుంది. ఒకోసారి సమస్యలు, సవాళ్లు ఎదురవుతుంటాయి. టెన్షన్ పడకుండా ఆత్మవిశ్వాసంతో ఎదుర్కోవడం వల్ల భవిష్యత్తులో దృఢంగా ఉంటారు. విందు, వినోదాలు, దూరపు ప్రయాణాలతో సేదతీరే ప్రయత్నం చేస్తారు. ప్రేమ వ్యవహారాలలో నిర్ణయం తీసుకోవలసి వస్తుంది.

**కలిసొచ్చే రంగు: తెలుపు, వంగపువ్వు**

**కన్య (ఆగస్ట్ 23 - సెప్టెంబర్ 22)**

వారమంతా క్షణం తీరుబడి లేకుండా గడుపుతారు. అవిశ్రాంతంగా పని చేసినా, చురుగ్గా ఉంటే కానీ, పనులు తొందరగా పూర్తి కావని గ్రహించండి. పనిలో మీకు బృందసాయం లభిస్తుంది. మీ శక్తిసామర్థ్యాలకు మరింత పదును పెట్టుకుని, శ్రద్ధాసక్తులతో పనిని పూర్తి చేస్తారు. మీ ప్రేమ ఫలిస్తుంది. విందు, విహార యాత్రలను ఆనందించడానికి ఆరోగ్యం అనుకూలం.

**కలిసి వచ్చే రంగు: వెండి**

**తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 22)**

జీవితంలో ఎప్పుడూ గెలుపు మనదే అనుకోవడం పొరపాటు. ఓడిపోయినంత మాత్రాన కుంగిపోవడం అవివేకం. ఎందుకంటే ఓడినప్పుడే కదా, మీ శక్తిసామర్థ్యాలు మీకు తెలిసేది. వృత్తినైపుణ్యాన్ని పెంచుకుంటారు. మంచి ప్రాజెక్టులను విజయవంతంగా పూర్తి చేసి, బ్యాంక్ బ్యాలెన్స్ పెంచుకుంటారు. పద్ధతి ప్రకారం పనులు పూర్తి చేసి, ప్రశంసలు పొందుతారు.

**కలిసొచ్చే రంగు: ముదురాకుపచ్చ**

**వృశ్చికం (అక్టోబర్ 23 - నవంబర్ 21)**

పాతబంధాలు బలపడతాయి. దానితోబాటు మీ స్నేహితులు, బంధుమిత్ర సన్నిహితుల జాబితాలో కొత్తపేర్లు చేరతాయి. వెన్నునొప్పి బాధించవచ్చు. అయితే అలాంటి ఆరోగ్య సమస్యలకు అనవసరమైన ఆందోళన మాని, ప్రకృతి ఉత్పాదనల వాడకంతో మెరుగైన ఆరోగ్యాన్ని పొందుతారు. జీవితమంటే ఎప్పుడూ పని, పరుగులే కాదు, కాస్త విశ్రాంతి, ప్రేమ, ఉల్లాసం కూడా అవసరం అని తెలుసుకోండి.

**కలిసివచ్చే రంగు: ఆకుపచ్చ**

**ధనుస్సు (నవంబర్ 22 - డిసెంబర్ 21)**

భద్రతకు, విజయానికి ప్రాధాన్యత ఇస్తారు. ఊహించినంత ఆనందంగా, సాఫీగా రోజులు గడవడం లేదనిపిస్తుంటుంది. అయితే, ప్రణాళికాబద్ధంగా చేయడం వల్ల తగిన ఫలితం ఉంటుందని గ్రహించండి. వ్యాపారులకు ఈ వారం అద్భుతంగా ఉంటుంది. మంచి ఆదాయాన్ని, లాభాలను కళ్లజూస్తారు. ప్రేమ కొత్త మలుపులు తీసుకోవచ్చు. మీ రుగ్మతలకు సంగీత చికిత్స ఉపకరిస్తుంది.

**కలిసివచ్చే రంగు: లేత వంకాయరంగు**

**మకరం (డిసెంబర్ 22 - జనవరి 19)**

మీది కాని కొత్తలోకంలో మిమ్మల్ని మీరు మరచిపోతారు. మీకున్న విజ్ఞానంతో, మీవైన కొత్త ఆలోచనలతో అందరినీ ఆకట్టుకుంటారు. మీ బాధలు, పాతజ్ఞాపకాలను మరచిపోయేందుకు ధ్యానాన్ని ఆశ్రయిస్తారు. అందరితోనూ శాంతి, సామరస్యాలతో మెలిగేందుకు ప్రయత్నిస్తారు. కుటుంబంతో కలిసి దూరప్రయాణం చేస్తారు. ప్రకృతి ఉత్పాదనలు, స్వచ్ఛమైన గాలి, నీరు వల్ల స్వాంతన పొందుతారు.

**కలిసి వచ్చే రంగు: వెండి**

**కుంభం (జనవరి 20 - ఫిబ్రవరి 18)**

ఇనుమడించిన ఉత్సాహంతో పనులు ప్రారంభిస్తారు. ప్రజా సంబంధాలను నెరపడంలో, వాటిని మరింత మెరుగు పరచుకోవడంలో మీకు మీరే సాటి అన్నట్లుగా ఉంటారు. ఆందోళన మాని వృత్తిగతమైన మెలకువలతో పని చేయండి. సహోద్యోగులకు మీ ఆలోచనలు నచ్చకపోవచ్చు. మనసు చెప్పినట్లు నడచుకోండి. చెవి లేదా గొంతునొప్పి బాధించవచ్చు.

**కలిసి వచ్చే రంగు: ఎరుపు**

**మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20)**

ఆర్థికంగా చాలా బాగుంటుంది. చెడు అలవాట్లకు స్వస్తి పలకాలని నిశ్చయించుకుంటారు. అలా ఎన్నోసార్లు. కానీ, చెడ్డ అలవాట్లు అలవడినంత తొందరగా వదలవని గ్రహిస్తారు. మీ జీవిత భాగస్వామి ధోరణి మీకు నచ్చకపోవచ్చు. మీ వైఖరి వారికి ఇష్టం లేకపోవచ్చు. కానీ, ఒకరికొకరు సర్దుకుపోయి. సామరస్యంగా జీవించడమే కదా జీవితం. అదృష్టం వరిస్తుంది.

**కలిసొచ్చే రంగు: ఊదా**

# మా ఇంటి మనీ ప్లాంట్!

‘‘నాన్నా... కుండీలో మొక్క అయినా, అడవిలో చెట్టయినా అలా కదలిక లేకుండా ఎప్పుడూ నిశ్చలంగా ఉంటుంది. మొలకెత్తి అలా పెరుగుతూ ఉండటం తప్ప... పాపం.... దానికి మరో పనేమీ ఉండదు కదా. మొక్కలకు బోర్ కొట్టదా నాన్నా. వాటికి టైంపాస్ ఎలాగో ఏమిటో?’’ అంటూ జాలిపడ్డాడు మా బుజ్జిగాడు.

నాకు ఆ ఆలోచన ఎప్పుడూ రాలేదు గానీ... వాడు చెప్పగానే ‘పాపం... నిజమే కదా’ అనిపించింది. సరిగ్గా మా బుజ్జిగాడు పై మాటలు చెబుతున్న టైమ్‌లోనే ఇంట్లోకి ఎంటరయ్యాడు మా రాంబాబుగాడు. వాడి మాటలు తానూ విన్నాడు.

‘‘ఒరేయ్ బుజ్జిగా... చెట్లూ, మొక్కలూ అలా నిశ్చలంగా ఉన్నట్లు కనిపిస్తాయిగానీ... మనుషులు చేసే పనులు చాలా చేస్తుంటాయవి. అంతెందుకు పొద్దున్నే వాకింగ్ చేయడం, బిజినెస్సులు చేయడం, ప్రలోభ పెట్టడం, మోసాలు చేయడం లాంటి ఎన్నో పనులు చేస్తాయవి. ఈ విషయాలేమీ మీ నాన్నకే తెలియదు. ఇంక నీకేం చెబుతాడు?’’ అన్నాడు రాంబాబుగాడు.

‘‘ఏమిటీ... మొక్కలు వాకింగ్ చేస్తాయా?’’ ఆశ్చర్యంగా అడిగాను నేను. అంతే! మా బుజ్జిగాణ్ణి వదిలేసి నన్ను తగులుకున్నాడు.

‘‘యా... పొద్దున్నే ఆకులో మరో ఆకు వేసుకుంటూ సూర్యుడి వైపు వాకింగ్ చేస్తాయవి. మనం అడుగు పక్కన అడుగు వేయడాన్ని వాకింగ్ అంటాం కదా. అలా అవి ఆకు నుంచి ఆకు పెంచుకుంటూ... అనగా మారాకు వేసుకుంటూ పోయే ప్రక్రియను ‘ఆకింగ్’ అనుకోవచ్చు కదా. ఇప్పుడు చెప్పు... సదరు ‘ఆకింగ్’ అన్నది మన ‘వాకింగ్’ లాంటి ఎక్సర్‌సైజు ప్రక్రియ అని నీకు అనిపించడం లేదూ’’ ఎక్స్‌ప్లెయిన్ చేశాడు రాంబాబు గాడు.



‘‘మరి అవి బిజినెస్ కూడా చేస్తాయంటున్నావ్. అదెలా?’’ అడిగాను నేను.

‘‘అదీ చెబుతా విను. పూలు పూసే సమయానికి వాటికి వింత రంగులూ, మంచి వాసనలు వెలువడేలా చూసుకుంటాయి. అంటే ఇది తమ బిజినెస్ షోరూమ్‌నూ కాదంటే బ్యాలెన్స్‌షీటునూ అలంకరించుకోవడం అన్నమాట. ఇలా ఎందుకూ అంటే... కీటకాలను తమ వైపునకు ఆకర్షించడానికి అన్నమాట. అలా ఆకర్షించాక పుప్పొడి కీటకాల కాళ్లకు అంటేలా చేసి పండ్లు అయ్యేలా చూసి, వాటికి రుచి కూడా అద్ది... పక్షులు తినేలా జాగ్రత్తలు తీసుకొని... తమ సంతతిని బాగా విస్తరించుకునేలా చేస్తాయి. అంటే ఇవన్నీ చెట్ల తాలుకు బిజినెస్ ఎక్స్‌పాన్షన్ కార్యకలాపాలన్నమాట. ఒక రహస్యం చెప్పనా... పుప్పొడిని వ్యాపింపజేసేందుకు కీటకాలకు తేనెనీ, మకరందాన్నీ లంచంగా సమర్పిస్తాయి. అంతేనా... తమ గింజలను వ్యాప్తి చేయడానికి రుచిగల పండులోని గుజ్జును ఆమ్యామ్యాగా ఇస్తాయి. అలా ఈ బిజినెస్‌లో ‘ఫార్మాలిటీ’గా చేయాల్సిన ‘పేమెంట్స్’ అనీ అలా ఆ రూపంలో చేసేస్తుంటాయవి. కాస్త లోతుగా చూడు. తమ ప్రజాతిని ఒక ‘బ్రాండు’ అనుకుంటే... ఆ ‘బ్రాండ్’ను ‘గ్రౌండ్’ మీద విస్తరింపజేసుకోడానికి కావాల్సినంత ‘గ్రౌండు’వర్కు చేస్తాయి చెట్లు. ఇప్పుడు చెప్పు... చెట్లు బిజినెస్ చేసుకోవడం లేదంటావా?’’ వివరించాడు మా రాంబాబుగాడు.

‘‘చెప్పురా... చెప్పు... నోటికి ఎంత మాట వస్తే అంత మాటా కూసెయ్. ఇక లేటెందుకూ చెట్లు కూడా పెద్ద నోట్ల రద్దు... డీమానిటైజేషన్ వంటి కార్యకలాపాలు చేస్తాయని చెప్పెయ్’’ అంటూ కోపంగా అరిచాను నేను.

‘‘ఆ... ఎందుకు చెయ్యవ్. నీళ్లు తక్కువగా దొరికే సీజన్ వచ్చిందనుకో. ఆకులన్నింటినీ ఉపసంహరించుకుంటాయి కొన్ని చెట్లు. తమలోంచి నీరు ఆవిరి కాకుండా రక్షించుకోవడం కోసం తమ కరెన్సీలాంటి ఆకులను ఉపసంహరించుకుని, ఆ స్థానంలో ముళ్లను మొలిపించుకుంటాయి. అలా లిక్విడ్ కరెన్సీ లాంటి ఆకును రాల్చేసుకుని లిక్విడ్‌ను సేవ్ చేసుకుంటాయి. ఈ ప్రక్రియ మొక్కల తాలూకు డీమానిటైజేషన్ లాంటిది కాదంటావా చెప్పు. ఈ ఆకు రాల్చే ‘డెసిడ్యువస్’ వనాలన్నీ ఆకు రద్దు కార్యక్రమం చేపట్టి... మళ్లీ వర్షాలవీ పుష్కలంగా కురవగానే కొత్త కరెన్సీ లాంటి ఆకులను ప్రింట్ చేసుకుంటాయి. చెట్లు ఇలా బిజీగా హెవీగా బిజినేస్సు చేస్తాయి. అన్నట్టు కార్పొరేటు అనే మాట ఎలా పుట్టిందనుకుంటున్నావ్? చెట్లు కలపను... అంటే... కర్రను ప్రొడ్యూస్ చేస్తాయి. వాటికి రేటు బాగా పలుకుతుంది. ఆ కలప తాలుకు పర్యాయ పదమైన కర్ర ప్లస్ రేటు కలిసి కర్రపరేటు... కార్పొరేటు అనే మాట పుట్టిందన్నమాట’’ అంటూ వివరించాడు వాడు.

‘‘అయినా సరే... నీదంతా వితండ వాదం. నీ మాటలను నేను నమ్మను. అంత అమాయకమైన మొక్కలు మోసాలూ చేస్తాయనే మాట అనడానికి నీకు నోరెలా వచ్చిందిరా’’ అంటూ వాణ్ణి గట్టిగా నిలదీశా.

దానికి వాడు చిద్విలాసంగా నవ్వాడు. ‘‘ఒరే నాయనా. నీకు తెలియదూ... ఒకరు చెబితే వినవు. ఫ్లై ఆర్కిడు అనే మొక్క తాలూకు పువ్వు ఎలా ఉంటుందో తెలుసా? కాస్త బుజ్జిగాడు వినకుండా ఉండటానికి ఆ చెవి ఇటు పడేయ్. ఆ పువ్వులు అచ్చం మేటింగ్ కోసం రెడీగా ఉన్న ఆడ కీటకంలా ఉంటాయి. అంతేకాదు... వాటి వాసన కూడా మగకీటకాన్ని ఆకర్షించడానికి ఆడ ఆడకీటకం వెలువరించే ఫెరోమోన్ అనే సెంట్‌లా ఉంటుంది. ఇది మోసం కాదంటావా. ఒరేయ్... బిజినెస్‌లో కాస్త మోసం ఉంటుంది. విస్తరణ అనే తమ స్వలాభం కోసం కీటకాల తాలుకూ శ్రమదోపిడీ ఉంటుంది. కారల్ మార్క్స్ కూడా కనిపెట్టని రహస్యాలతో ‘ప్లాంట్ క్యాపిటల్’ అనే పుస్తకం రాసి నీలాంటి అమాయకులకెందరికో కనువిప్పు కలిగిద్దామని నా ఉద్దేశం రా’’ అంటూ రాంబాబు గాడు తన కొత్త ప్రాజెక్టు గురించి చెప్పగానే... నేను చేష్టలుడిగిపోయి అచ్చం చెట్టులా కొయ్యబారిపోయా.

- యాసీన్

